ప్రవేశ రుసుము లేదు




# చందమామ కేమెల్
## రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**

**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు

ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని పూర్తిగా కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పో. బా. నం. 9928 కొలాబా, బొంబాయి-400 005.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

Name: ........................................................ Age: ....................

Address: ........................................................................

.................................................................................

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: 28-2-1983

**CONTEST NO 28**

VISION Tel

# న్యూట్రముల్ శక్తి.

## ఛాంపియన్లు ఎంచుకునేది యిది.

న్యూట్రముల్. సమృద్ధి అయిన అమూల్ పాలు. ఎంచిన మాల్ట్. ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు. పుష్టినిచ్చే ప్రోటీన్లు. అత్యవసరమైన ఖనిజాలు. ఉల్లాసాన్నిచ్చే చాక్లెట్... యివన్నీ గూడా బోర్న్‌విటా. బూస్ట్. మాల్టోవా కన్నా చాలా తక్కువ ధరలో. మరో విషయం గుర్తుంచుకోండి. కేవలం న్యూట్రముల్‌కే ఐ ఎస్ ఐ నాణ్యతముద్ర వుంది.







**మరింత పొడుగ్గా, బలంగా, పుష్టిగా అవడం ఎలా?**

కనివిని ఎరుగని శక్తినిచ్చే పుస్తకపు కానుక!

To: Nutramul, P.O. Box 10148, Bombay 400 001. IT

ప్రియమైన న్యూట్రముల్,

దయయుంచి నాకు దారాసింగ్ గారి 'హైట్ ఇన్‌క్రీజ్ స్ట్రెంగ్త్ అండ్ ఫిట్‌నెస్' పుస్తకం పంపించండి. నేను రు. 1-50 పోస్టేజి స్టాంపులూ. న్యూట్రముల్ 500 గ్రా. డబ్బా కొన్న క్యాష్ మెమోనీ జతపరుస్తూన్నాను. సరుకు సరుకు వున్నంతవరకే యీ కానుక అని నాకు తెలుసు.

పేరు ______________ (పెద్ద అక్షరాలలో)

అడ్రసు ______________



మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లి.
ఆనంద్ 388 001

daCunha/GCM/76/TL/82

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''జన్మరహస్యం''] కు ఆధారం ''వసుంధర'' రచన.

నమ్మదగిన కారణాలంటూ ఏమీ లేకపోయినా, ఎదుటి వాళ్ళను స్వార్థపరులన్న దృష్టితో చూడడం కొందరికి అలవాటు. ఇది, రాజంతటి వాడి మనస్తత్వమే అయితే, అందువల్ల కలగబోయే నష్టాలు ఎలా వుండేదీ, ''క్షామపరిస్థితులు'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

కులం, రూపం, వయో విద్యా ధనమేతత్తు పంచకమ్,
సతాం వినయహేతుః స్య రసతాం గర్వకారణమ్.

[మంచి వంశం, చక్కని రూపం, విద్య, ధనం—ఈ అయిదూ ఉత్తములకు వినయాన్నీ, అల్పులకు గర్వాన్నీ కలిగిస్తాయి.]

సంపుటి 72 ఫిబ్రవరి '83 సంచిక 2

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00






సూర్యాస్తమయం అయి చీకటి పడుతున్న సమయంలో, పెద్ద ఉరుములూ, మెరుపులతో వాన ప్రారంభమయింది. అప్పటికి కొన్నాళ్ళుగా ఎక్కడైనా ఉద్యోగం దొరుకుతుందేమో అని ఊళ్ళు పట్టుకు తిరుగుతున్న కిరీటి, ఆ సమయంలో ఒక చిన్న గ్రామాన్ని సమీపిస్తున్నాడు. అతడికి దాపుల్లో శిథిలావస్థలో వున్న ఇల్లొకటి కనిపించింది. చప్పున పోయి ఆ ఇంటి అరుగు మీద నిలబడ్డాడు.

బయట కుండపోతగా వాన కురుస్తున్నది. చూస్తూండగానే బాగా చీకటి పడిపోయింది. వాన తగ్గే సూచనల్లేవు. ఇప్పుడేం చేయడమా అనుకుంటూ కిరీటి ఇంటి ద్వారబంధాల కేసి చూశాడు. తలుపుకు బాగా తుప్పు పట్టిన తాళం వేళ్ళాడుతున్నది. అంతలో అక్కడికి వానలో తడుస్తూ వచ్చిన ఒక ఇరవై ఏళ్ళ అమ్మాయి, ఇంటి చూరు కింద నిలబడుతూనే, మెరుపుకాంతిలో కిరీటిని చూసి తుళ్ళిపడింది.

కిరీటి ఆమెకు పొడిగా వున్న తన పైపంచ యిస్తూ, "భయపడకు! ముందు తల తుడుచుకో. నేనేం దొంగను కాదు. అయినా, యింత చీకటీ, వర్షంలో ఒంటరిగా ఎక్కడికి బయలుదేరావు?" అని అడిగాడు.

ఆమె కొంచెం తటపటాయించి, కిరీటి ముఖంకేసి ఒకసారి పరీక్షగా చూసి, "ఈ పక్క గ్రామంలో వున్న మా బంధువుకు జబ్బుగా వుంటే చూసి వస్తున్నాను. బాడుగ బండివాడు, ఆఖరి క్షణంలో వాన భయంవల్ల బండి కట్టననేశాడు. ఇప్పుడీ వానాగాలిలో ఏం చేయాలో తోచడంలేదు. మా ఊరు యిక్కడికి అరకోసు దూరంలో వుంది," అన్నది.

మాచిరాజు కామేశ్వరరావు

అంతలో పాడుబడ్డ ఇంటి కిటికీలోంచి గబ్బిలం కీచుమంటూ ఆమె తల మీదుగా ఎగిరిపోయింది. ఆమె భయంతో కెవ్వు మన్నది.

కిరీటి నవ్వి, "వర్షంలో ఒంటరిగా రావడం చూసి, చాలా ధైర్యవంతురాలి వనుకున్నాను," అన్నాడు.

ఆమె సిగ్గుపడుతూ, "నాకు దొంగ లన్నా, చీకటన్నా, పాములన్నా భయం లేదు; కాని దయ్యాలంటే మహా చెడ్డ భయం. పాడుబడ్డ ఇళ్లల్లో దయ్యా లుంటవి గదా!" అన్నది.

తరవాత ఆమె తన పేరు శిల్ప అని చెప్పింది.

కిరీటి ఒక క్షణం ఆగి, "చూడు, శిల్పా! మనకు ముందు తెలియదుగాని, మన చుట్టూ వున్న మనుషుల్లో దయ్యా లను మించినవాళ్ళున్నారు. నా సంగతే చూడు! మా నాన్న పోయాక బంధువుల మంటూ ఇంట చేరినవాళ్ళు, నన్ను రక రకాలుగా మోసగించి, ఉన్న కొద్దిపాటి ఆస్తి కాజేశారు. నేను బతుకు తెరువుకు ఉద్యోగం కోసం వెతుకుతూ తిరుగు తున్నాను. నాకు దయ్యాలకన్నా, మనుషు లంటేనే భయం," అన్నాడు.

"పోనీండి! ఈ రాత్రివేళ దయ్యాల ఊసెందుకు," అన్నది శిల్ప.



వర్షం తగ్గే సూచనలు లేకపోవడంతో కిరీటి, "ఇక మనం, యీ రాత్రికి యీ ఇంట్లోనే తలదాచుకోక తప్పదు," అని, తుప్పు పట్టిన తాళాన్ని గట్టిగా లాగాడు. అది చేతిలోకి ఊడి వచ్చింది.

అంతలో, లోపలి నుంచి, "ఎవరు వాళ్ళు? నేను దయ్యాన్ని. జాగ్రత్త, లోపలికి రాకండి!" అన్న కేక విని పించింది.

శిల్ప వణికిపోతూ, కిరీటి చెయ్యి పట్టు కుని, "వర్షం అయితే అయింది, పారి పోదాం రండి," అన్నది.

కిరీటి ఆ మాటలు వినిపించుకోకుండా, కాలితో తలుపును గట్టిగా తన్నాడు. అది



విరిగి దభీమని వెనక్కు పడిపోయింది. అతడు చీకటిలోకి చూస్తూ, "మేం మనుషులం, దయ్యాలకు దడవని వాళ్లం!" అంటూ లోపలికి వెళ్ళాడు.

గది మధ్య ఒక ముసలి దయ్యం కూర్చుని వుంది. అది కిరీటినీ, శిల్పనూ చూస్తూనే, "ఎంత ధైర్యం! ఎంత పొగరు! నిలువునా చీల్చేస్తా," అన్నది.

"అదేదో తరవాత చేద్దువుగాని, ముందు యీ సంగతి చెప్పు! ఈ పాడు కొంపనా నువ్వు కాపలా కాస్తున్నది?" అని అడిగాడు కిరీటి.

ఆ ప్రశ్న వింటూనే ముసలి దయ్యం ఏడుపు ముఖం పెట్టి, "ఛీ, యీ కొంప అంటే నాకు పరమచీదర! నా పెళ్ళాం, పిల్లలూ డబ్బు కోసం నన్ను జలగల్లా పట్టుకుని నానాహింసా పెట్టేవాళ్ళు. హవ్వ! సంపాయించడం ఖర్చు పెట్టడానికా? నేనేం వాళ్ళ పప్పులు ఉడకనివ్వలేదు. నే కాపలా కాస్తున్నది, యిక్కడ దాచిన నిధిని," అన్నది.

కిరీటి దయ్యంకేసి జాలిగా చూస్తూ, "పెళ్ళాం పిల్లలూ, నువ్వూ కూడా అనుభవించక చచ్చి దయ్యానివై, ఆ డబ్బుకు కుక్క కాపలా కాస్తున్నావన్న మాట!" అన్నాడు.

ముసలి దయ్యం కొంతసేపు ఆలోచనలో పడింది. ఏళ్ళ తరబడిగా అక్కడ కాపలా కూర్చోవడం దానికీ విసుగనిపిస్తున్నది. అది గది మధ్య ఒకచోట తవ్వి, పెట్టె నొక దాన్ని పైకి తీసి మూత తెరుస్తూ, "ఈ డబ్బంతా నువ్వు తీసుకో. నాకు యీ కాపలా బాధ తప్పుతుంది," అన్నది.

కిరీటి పెట్టెలోని నాణాలు కొన్ని తీసుకుని చూసి, "నువ్వు చచ్చిపోయి చాలా పెద్దకాలమే అయినట్టుంది; ఇప్పుడు యీ రాగీ, సత్తూ నాణాలు చెల్లవు!" అన్నాడు.

"అయ్యో, అలాగా!" అంటూ దయ్యం పెద్దగా మూలిగింది.

ఆ మరుక్షణం దానికి గబ్బిలం ఆకారం వచ్చింది. అది కీచు మంటూ పెట్టెలోని నాణాల మీద ఒకసారి వాలి, తుర్రు మంటూ బయిటికి ఎగిరిపోయింది.

కిరీటి పెట్టెను దయ్యం తవ్విన గుంటలో పడవేసి గట్టిగా చేతులు దులుపుకుంటూ శిల్ప కేసి చూశాడు.

శిల్ప ఆశ్చర్యంగా, "అబ్బ, మీ రెంత ధైర్యవంతులండీ!" అన్నది.

"నా ధైర్యానికేం గాని, యీ రాత్రికి మనం యిక్కడ కాలంగడపక తప్పదు," అన్నాడు కిరీటి.

ఇద్దరూ గదిని సాధ్యమైనంతలో శుభ్రం చేసుకుని నిద్రపోయారు. తెల్లవారి కిరీటి నిద్రలేచేసరికి, శిల్ప అరుగు మీద నిలబడి రాత్రి గాలివాన దెబ్బకు విరిగి పడిన చెట్ల కేసి చూస్తున్నది.

"చాలా పెద్ద గాలివానే నన్న మాట! రాత్రి మనకు యీ దయ్యం కొంప దొరకడం అదృష్టం," అన్నాడు కిరీటి.

"మీకు మరొక అదృష్టం ఎదురవబోతున్నది. మా నాన్న దగ్గిర మీకు ఉద్యోగం యిప్పిస్తాను. అయితే, అందుకు చిన్న కథ ఒకటి కల్పిస్తాను. రాత్రి వర్షంలో దొంగలు నా నగలు కాజేయాలని చూస్తుంటే, మీరు రక్షించారని చెబుతాను," అన్నది శిల్ప.



కిరీటి ఏమీ మాట్లాడకుండా తల వూపి ఊరుకున్నాడు.

తర్వాత వాళ్ళు బయలుదేరి శిల్ప ఊరు చేరేసరికి మధ్యాన్నమయింది. చుట్టూ పళ్ల చెట్లూ, రకరకాల పూలమొక్కలూ వున్న శిల్ప వాళ్ల పెద్ద డాబా ఇల్లు చూడగానే, కిరీటి వాళ్ళు చాలా ఆస్తిపరులని గ్రహించాడు.

శిల్ప తండ్రి ఆమెను చూస్తూనే, "క్షేమంగా వచ్చావా, తల్లీ! నువ్వు ఇల్లు చేరలేదన్న బెంగతో నాకు రాత్రి నిద్రే లేదు," అన్నాడు.

శిల్ప తండ్రికి కిరీటిని చూపుతూ, తాను కల్పించిన కట్టుకథ చెప్పి, "ఈయన

చేసిన సహాయానికి, నువ్వేదన్నా ఉద్యోగం యివ్వాలి, నాన్నా!" అన్నది.

"ఉద్యోగమా! ఒక్క ఉద్యోగం యిచ్చినంత మాత్రాన నా రుణం తీరుతుందా?" అంటూ శిల్ప తండ్రి కిరీటి రెండు చేతులూ పట్టుకున్నాడు.

కిరీటి ఆయనతో, "క్షమించండి! మీ అమ్మాయి చెప్పింది నిజం కాదు. నేనే దొంగల బారినుంచీ ఆమెను రక్షించలేదు. ఎంత నిరుద్యోగినైనా, అబద్ధాలు చెప్పి ఉద్యోగం సంపాయించడం నాకు నచ్చదు," అన్నాడు.

శిల్ప తండ్రి కూతురు కేసి అయోమయంగా చుశాడు. శిల్ప నవ్వి జరిగినదంతా తండ్రికి చెప్పి, "ఆ మధ్య కొంత కాలంగా నా పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నావు గదా, నాన్నా. ఈయన నాకు నచ్చాడు. అయితే, మనిషి మనస్తత్వం ఎలాంటిదో తెలుసుకునేందుకు చిన్న నాటకం ఆడాను. అబద్ధాలాడి సంపాయించే ఉద్యోగం యిష్టంలేదన్నాడంటే, ఆయన నిజాయితీ తెలుస్తూనే వున్నది," అన్నది.

శిల్ప తండ్రి ఎంతో సంతోషపడిపోతూ కిరీటి కేసి ఒకసారి చూసి, భార్యను పిలుచుకు వచ్చేందుకు గబగబా ఇంట్లోకి వెళ్ళాడు.

కిరీటి, శిల్పతో, "మీ అంతస్తుకి నేను తగినవాణ్ణి కాను. మరొకసారి ఆలోచించుకో!" అన్నాడు.

శిల్ప చిరుకోపంగా, "ఇక్కడ అంతస్తుల గొడవలు తేకండి. మీ ధైర్యం, నిజాయితీ నాకు నచ్చినై. ఒకవేళ నేను, మీకు నచ్చకపోతే, ఆ మాట చెప్పెయ్యండి," అన్నది.

"ఆస్తిపాస్తులు పోయి, నిరుద్యోగిగా ఊళ్ళుపట్టుకు తిరగడం మేలే అయింది. అలా కాకపోతే, నీ లాంటి మంచి భార్య నా కెక్కడ దొరికేది!" అన్నాడు కిరీటి.

అప్పుడే అక్కడికి వస్తూ, కిరీటి మాటలు విన్న శిల్ప తల్లిదండ్రులు పరమానందం చెందారు.






## 16

[సముద్ర తీరంనుంచి వినవచ్చిన కేకలు ఎవరివో తెలుసుకునేందుకు వెళ్ళిన శివదత్తుడికీ, అతడి అనుచరులకూ సముద్రపు దొంగల నాయకుడైన సముద్రకేతుడు కనిపించాడు. అతడి బారినుంచి తప్పుకు పారిపోతున్న ఇద్దరు స్త్రీలు అడవిలోకి పరిగెత్తారు. ఆ సమయంలో వారిని వెన్నంటి వస్తున్న సముద్రకేతుణ్ణి, శివదత్తుడు ఎదుర్కొన్నాడు. తరవాత—]

శివదత్తుడు, తన అనుచరులతో చెట్ల చాటుకు పారిపోయేంతలో ఒడ్డుకు చేరిన రెండు పడవలలోనుంచి కేకలు పెడుతూ కొందరు సముద్రపు దొంగలు కిందికి దిగారు. బాగా అలిసిపోయిన సముద్ర కేతుడు కత్తిని, అక్కడ ఇసుకలో గుచ్చి రొప్పుతూ. "హేయ్, వాళ్ళంతా చెట్ల చాటుకు పారిపోయారు. ఇంతదాకా మీరేం చేస్తున్నారు," అంటూ తన అనుచరుల్ని కసిరాడు. తరవాత, స్త్రీలు పారిపోయినవైపుకేసి చేయి చూపుతూ, "ఒక్క ఇరవైమంది మాత్రం ఇక్కడ ఉండి, తతిమ్మా వాళ్ళు ఆ అడదయ్యాలను వెతికి పట్టుకురండి!" అని ఆజ్ఞాపించాడు.

వెంటనే సముద్రపు దొంగలు బిల బిలమంటూ అడవికేసి పరిగెత్తారు. సముద్రకేతుడి ఆజ్ఞలను శివదత్తుడు




విన్నాడు. అతడు తన అనుచరులతో గుబురుగా పెరిగిన పొదల చాటున ఉండి యిదంతా గమనిస్తున్నాడు.

''శివదత్తా, ఇప్పుడు మనం ఏం చేయాలి? చూస్తూ ఊరుకుంటే, పారిపోయిన ఆ స్త్రీల నిద్దరినీ, ఈ సముద్రపు దొంగలు తిరిగీ పట్టుకోగలరు!" అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు నిస్సహాయంగా తలవూపి, ''ఇప్పటి పరిస్థితుల్లో మనం చేయగలిగిందేమీ లేదు. మనం ఎనిమిది మందిమీ అసంఖ్యాకంగా వున్న, ఈ సముద్రపు దొంగలను ఎదిరించితే సర్వనాశం అయిపోతాం. ఈ సరికి, ఆ స్త్రీలిద్దరూ, అడవిలోకి చాలాదూరం పోయి, సురక్షితంగా దాక్కోగలరని ఆశిద్దాం!'' అన్నాడు.

ఒక అరగంట గడిచేసరికి, అడవి ప్రాంత మంతా మర్మోగేలా, దొంగల కేకలు వినిపించినై. కొద్ది సేపటికల్లా వాళ్ళు సముద్రకేతుణ్ణి సమీపిస్తూ, ''అయ్యా, ఆ ముసలిది కనబడ లేదు. దీన్ని మాత్రం పట్టుకోగలిగాం!'' అంటూ అతి సౌందర్యవతి అయిన కన్య నొకదానిని, తమ నాయకుడి దగ్గరకు పట్టుకు వచ్చారు.

''అహ్హ హ్హ!'' అంటూ సముద్రకేతుడు నవ్వి, ''మనకు డబ్బు తెచ్చిపెట్టేది ఇదే! ఆ ముసలిది తిండి దండగ తప్ప మరెందుకూ కొరగాదు. ఇక పడవ లెక్కండి!'' అంటూ వెనుదిరిగి, ''అన్నట్టు, ఇక్కడ చేరిన ఆ కొత్తవాళ్ళెవరో గుర్తుపట్టారుగదా? ఈ ప్రదేశం కూడా మరిచిపోకండి. వీలయినప్పుడు వచ్చి వాళ్ళందర్నీ వేటాడాలి!'' అన్నాడు రోషంగా.

సముద్రకేతుడి నాలుగు పడవలూ తీరం నుంచి లోపలకు బయలుదేరినై. శివదత్తుడు ఆ పడవలకేసి క్షణకాలం చూసి, ''ఇక, ప్రస్తుతానికి మనం చేసేదేమీ లేదు. భోజనాలు ముగిద్దాం, పదండి!'' అనేంతలో, దూరం నుంచి ఎవరో స్త్రీ రోదిస్తున్న ధ్వని వినబడింది.

శివదత్తుడు ఆశ్చర్యపోతూ మందర దేవుడి కేసి చూసి, ఆ రోదన ధ్వని వచ్చిన వైపుకు బయలుదేరాడు. అనుచరు లందరూ, అతణ్ణి అనుసరించి నడిచారు.

శివదత్తుడు తన అనుచరులతో కొద్ది సేపటికల్లా ఆ స్త్రీ వున్న చోటుకు వెళ్ళాడు. ఆమె మరెవరో కాదు; సముద్రకేతుడి బారినుంచి పారిపో ప్రయత్నించిన ఇద్దరు స్త్రీలలో ఒకతె! శివదత్తుడు ఆమెను సమీపించి, "అమ్మా మీరెవరు? మీ పేరేమిటి? మీది ఏదేశం?" అని ప్రశ్నించాడు.

ఆ స్త్రీ శివదత్తుడి ప్రశ్నలు వింటూనే, ఉలిక్కిపడి తలఎత్తి అతడికేసి చూసి, భయభ్రాంతురాలైంది. అది గమనించిన శివదత్తుడు, "అమ్మా, మా నుంచి మీకు ఎలాంటి కీడూ రాదు. మీరు మరొక యువతితో, సముద్రకేతుడి బారినుంచి పారిపోవటం మేము చూశాం. నా అనుచరులు ఎనిమిదిమంది కన్న ఎక్కువ లేరు. ఈ కొద్దిమందితో దాదాపు యాభై అరవై మంది సముద్రపు దొంగలను ఎదిరించటం ప్రమాదకరమని ఊరుకున్నాను!" అన్నాడు.

"అయ్యో! స్వయంప్రభను, ఆ క్రూరులు తిరిగీ పట్టుకుపోయారు!" అంటూ ఆ స్త్రీ బిగ్గరగా విలపించసాగింది.



శివదత్తుడు, ఆమె దుఃఖాన్ని వారించేందుకూ, తను సహాయపడగలనన్న ధైర్యం ఆమెకు కలిగించేందుకూ తన కథ యావత్తూ ఆమెకు క్లుప్తంగా చెప్పాడు.

అంతా విన్న ఆ స్త్రీ ఏడ్పు మాని, "అయ్యా, నా పేరు దేవమాయి. . మాది శమనద్వీపం. పది పన్నెండేళ్ళ క్రితం నన్ను ఈ సముద్రకేతుడు బందీగా పట్టుకున్నాడు. అప్పటి నుంచీ వాడిదగ్గిర బానిసగా బతుకుతున్నాను. ఇప్పుడు వాడు బంధించుకుపోయిన కన్య పేరు, స్వయంప్రభ! ఆమెను నాలుగు రోజుల క్రితమే ఆ క్రూరుడు శమనద్వీప తీరంలో జలవిహారం చేస్తుండగా పట్టుకున్నాడు," అన్నది.

"అయితే, మీరు పదేళ్ళనుంచి ఆ సముద్రకేతుడి దగ్గిర బందీగా వుంటున్నారన్నమాట ? అలా అయితే, ఆ క్రూరుణ్ణి గురించి సర్వం మీకు తెలిసి వుంటుందని భావిస్తాను!" అన్నాడు శివదత్తుడు.

అందుకు దేవమాయి తల వూపి, "అయ్యా, వాణ్ణి గురించి సర్వం నాకు తెలుసు! ఈ ద్వీపం పడమటి తీరంలో 'మకరమండలం' అని పిలవబడే ఒకానొక కొండప్రదేశం వుంది. ఆ ప్రాంతానికి వెళ్ళేందుకు ఒకే ఒక మార్గం వుంది. అదంతా చిన్న చిన్న ఉప్పుటేరులమయం, ఆ ఉప్పుటేరుల్లో వున్న ఒక మిట్టప్రదేశం ఆ దుర్మార్గుడి నివాసస్థానం!" అన్నది దేవమాయి.

"అయితే, స్వయంప్రభను ఆ క్రూరుడు అక్కడికే పట్టుకుపోయి ఉంటాడు. ఆ మకరమండలంలో నివసించే మనుష్యులు నాగరిక జాతులా? లేక అడవి మనుష్యులా?" అని అడిగాడు శివదత్తుడు.

"ఆ మకరమండల వాసులు కేవలం అనాగరికులు మాత్రం కాదు. వారు చిన్న చిన్న పల్లెల్లో నివసిస్తూ ఉంటారు. వేటాడటమే వాళ్లకు ప్రధానమైన వృత్తి. వారికి ఒక రాజు కూడా ఉన్నాడు. కాని, గత నాలుగైదేళ్ళుగా ఆ ప్రాంతమంతా అల్లకల్లోలంగా ఉంది. దానికి కారణం మకరమండల ప్రాంతాల్లో గల ఒకానొక భయంకరమైన కొండ చరియలో నివాసం



ఏర్పరచుకున్న పెద్ద మొసలి!'' అన్నది దేవమాయి.

''ఒక్క మొసలి కారణంగా....అది ఎంత పెద్దదయినా - దాన్నుంచి మొత్తం మకరమండలవాసులు భయపడుతున్నారా? ఆశ్చర్యంగా వుంది!'' అన్నాడు శివదత్తుడు.

''అయ్యో, అది మామూలు మొసలి కాదు!'' అన్నది దేవమాయి, వికృతాకారుడైన వజ్రముష్టికేసి భయంగా చూస్తూ. ''ఆ మొసలికి పైశాచిక శక్తులున్నవనే వాదు ఉన్నది. దానిని వాళ్ళు 'మకర దేవత' అని పిలుస్తారు. దానికి ఆహారంగా ప్రతిదినం నలుగురైదుగురు మనుష్యులను వేస్తూంటారు. ఆ పని మకరమండల రాజైన హరిశిఖుడు స్వయంగా చేస్తూంటాడు. అందుకొవలసిన మనుష్యులను ఈ సముద్రకేతుడు, హరిశిఖుడికి అమ్ముతూంటాడు!''

''అదన్నమాట, అసలు రహస్యం!'' అంటూ శివదత్తుడు, మందరదేవుడికేసి చూశాడు.

''ఆ మొసలిని నేను సంహరించగలను. మీరు అనుమతించితే, ఆ మకరమండలానికి నేను బయలుదేరతాను!'' అన్నాడు వజ్రముష్టి శివదత్తుడి కేసి చూస్తూ ఉత్సాహంగా.

వజ్రముష్టి ఇలా అనేసరికి, దేవమాయి ముఖం మీద సంతోష చిహ్నాలు పొడచూపినై. ఆమె వజ్రముష్టి కేసి ఆప్యా






యంగా చూస్తూ, ''రెండు సంవత్సరాల క్రిందట, మకరమండల వాసి ఒకడు గణం పూని భవిష్యత్తులో జరగబోయే దాన్ని గూర్చి చెప్పాడు. మూడు నాలు గడుగులు ఎత్తుగల వికృతాకారు డొకడు, మకరమండలానికి త్వరలో వస్తాడనీ, అతడి చేతిలో ఆ మొసలికి చావు రాసి పెట్టి ఉన్నదనీ, ఆ తరవాత మకర మండలం ఏ అరిష్టాలూ లేకుండా, సర్వ సంపదలతో తులతూగగలదనీ అతడు అన్నాడు!'' అని చెప్పింది.

దేవమాయి మాటలకు శివదత్తుడు నవ్వాడు. తరవాత వజ్రముష్టి కేసి తిరిగి, ''బహుశా, ఆ వికృతాకారుడు వజ్రముష్టే కావచ్చు! నువ్వు ఆ మకరమండలానికి దారి చూపితే, మనం అక్కడికి బయలు దేరదాం!'' అన్నాడు.

''దారిలో, సముద్రకేతుడి నివాసస్థానం ఉంది! వాడి కంటబడకుండా, దానిని తప్పుకుపోవటం సాధ్యమయ్యే పనికాదు!'' అన్నది దేవమాయి, భయంతో వణికి పోతూ.

''ఆ సాధ్యా సాధ్యాలు మేము చూసు కుంటాం. స్వయంప్రభ కూడా ప్రస్తుతం ఆ క్రూరుడి అధీనంలో ఉండివుంటుంది!'' అన్నాడు మందరదేవుడు కోపంగా.

''అవును, ఆమెను కూడా ఆ సముద్ర కేతుడు మకరదేవతకు ఆహారంగా అమ్మ చూస్తున్నాడు. ఆ సంగతి నాకు తెలుసు. అందమైన యువతులకూ, బలిష్ఠులైన యువకులకూ హరిశిఖుడు ఎక్కువ ధనం ఇస్తూంటాడు. అందుకే సముద్రకేతుడు అలాంటి వాళ్ళకై సముద్రతీరాలు వెతుకు తూంటాడు!'' అన్నది దేవమాయి.

శివదత్తుడు ఆమె మాటలు విని, కొంచెంసేపు ఆలోచించి, ''దేవమాయీ, ఏ విధంగానైనాసరే, మేము స్వయం ప్రభను రక్షిస్తాం. ఆ క్రూర సముద్ర కేతుణ్ణి కూడా సర్వనాశనం చేసి తీరుతాం! హరిశిఖుడి సంగతి తరవాత ఆలోచించ వచ్చు.'' అన్నాడు.

శివదత్తుడి ఘాటలకు మందరదేవుడు అవునన్నట్లు తల ఊపాడు. తరవాత శివదత్తుడు తన అనుచరుల కేసి తిరిగి, "ముందు భోజనాలు ముగించుకుందాం. తరవాత జాగు చేయక వెంటనే ఆ మకర మండలానికి బయలుదేరుదాం!" అన్నాడు.

అనుచరులందరూ అంగీకార సూచకంగా తల లూపారు. దేవమాయితో సహా అందరూ లోగడ వదిలిపెట్టిన భోజనాల దగ్గరకు వచ్చి, త్వరత్వరగా భోజనాలు ముగించారు. అప్పటికి సూర్యుడు నెత్తి మీదికి వచ్చాడు. ఎండ తీక్షణంగా వుంది. కొంచెంసేపు విశ్రాంతి తరవాత, "ఇక బయలుదేరదాం. ప్రొద్దుకుంకే లోపల, ఆ సముద్రకేతుడి నివాసస్థానం ఎక్కడో తెలుసుకోవటం అన్ని విధాలా మంచిది!" అన్నాడు శివదత్తుడు.

కొద్దిసేపట్లో అందరూ ప్రయాణానికి సిద్ధమయారు. ద్వీపానికి పడమటి ప్రాంతాన గల సముద్రకేతుడి నివాస స్థానం తెలిసినది ఒక్క దేవమాయికే అవటంవల్ల, మార్గం చూపే బాధ్యత ఆమెకు ఒప్పచెప్పబడింది. శివదత్తుడూ, మందరదేవుడూ ఆమెకు ముందు వెనకల నడవసాగారు. అనుచరులు వాళ్ళ వెనక బయలుదేరారు.




వాళ్ళు నడుస్తున్న మార్గంలో ఎక్కడా జన సంచారం ఉన్న గుర్తులే లేవు. ఎక్కడా కాలి బాటలుగాని, నివాస స్థానాలుగాని వారికి కనిపించలేదు. చిత్తొత్తుగా పెరిగిన మహా వృక్షాలతో, వాటి మొదళ్ళకు అంటిపెట్టుకు పెరుగుతున్న అనేక రకాల అడవి చెట్లతో—ఆ ప్రాంత మంతా మిట్టమధ్యాహ్నం వేళ కూడా చీకటిమయంగా ఉంది. ఆ ప్రాంతాల, వారికి చెట్ల నుంచి వేలాడుతున్న పెద్ద పెద్ద కొండచిలువలు కనిపించినై.

అజాగ్రత్తవల్ల వాటి బారి పడకుండా, శివదత్తుడూ, అతని అనుచరులూ ఎంతో మెలకువతో ముందుకు నడవసాగారు.

సరిగా సూర్యాస్తమయం కాబోయే సమయంలో వజ్రముష్టి అందరికన్న ముందు నడిచి, దారి పక్కన ఉన్న ఒక పెద్ద చెట్టు ఎక్కాడు. అతడికి దాదాపు ఒక కోసుదూరంలో అల్లిబిల్లిగా ఉన్న సముద్రపు ఉప్పుటేర్లూ, అందులో చిన్న చిన్న భూభాగాలూ కనిపించినై. అలాంటి ఒక ప్రదేశంలో కొందరు మనుష్యులు కూడా సంచరిస్తూ ఉండడం వజ్రముష్టి గుర్తించాడు.

వజ్రముష్టి వెంటనే చెట్టు దిగి, శివదత్తుణ్ణి సమీపించి, "అయ్యా, మనం దేవమాయి చెప్పే సముద్రకేతుడి నివాసస్థానానికి ఎంతో దూరంలో లేమనుకుంటాను. ఆ చెట్టు మీంచి చూస్తే, పాముల్లా మెలికలు తిరిగి వున్న ఉప్పుటేర్లూ, అక్కడక్కడా భూప్రదేశం కనబడుతున్నది. ఒకచోట కొందరు మనుష్యులు కూడా కనిపించారు. వాళ్ళు సముద్రపు దొంగల ముఠా కావొచ్చు!" అన్నాడు.

"అలా అయితే, మనం అందరం ఒకేసారి ఆ ప్రాంతాన్ని సమీపించటం అంత మంచిది కాదు. అందువల్ల నువ్వు మరిద్దర్ని వెంటబెట్టుకుని ముందు వెళ్ళి, అక్కడ స్థితిగతు లేమిటో తెలుసుకు రా!" అని ఆజ్ఞాపించాడు శివదత్తుడు.

శివదత్తుడి ఆజ్ఞ కాగానే వజ్రముష్టి ఇరువురు అనుచరుల్ని వెంట తీసుకుని, బయలుదేరాడు. వాళ్ళు చెట్ల చాటున ఎంతో జాగ్రత్తగా నడుస్తూ, కొద్దిసేపటికి ఉప్పుటేర్లు ఉన్న ప్రాంతం చేరారు. ఉప్పుటేరు ఒడ్డున గుబురుగా పెరిగిన చెట్ల చాటునుంచి, ముందుకు చూసినప్పుడు వారికి ఉప్పుటేరులో చిన్న చిన్న తెప్పలు కొన్ని కనిపించినై. ఆ ఉప్పుటేరు వెడల్పు నలభై, యాభై గజాల కంటె ఎక్కువ ఉండదు. దాని అవతల అంచున ఉన్న ఎత్తయిన ప్రదేశం నుంచి వికృతమైన నవ్వులూ, కేకలూ వినిపించుతున్నవి.

— (ఇంకా వుంది)





# జన్మరహస్యం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రివేళ నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, ఒకొక్కక్కసారి నీ మీద జాలికి బదులు కోపం కలుగుతూంటుంది. నువ్వో లేక నిన్నీ పనికి పురిగొల్పినవాడో, ఏదో ఒక నిగూఢ రహస్యాన్ని పరులకు తెలియకుండా దాచచూస్తున్నాడని, నా నమ్మకం. అసలు రహస్యం అనేదాన్ని దాచడం సాధ్యమా ? ఇందుకు ఉదాహరణగా వసంతసేనుడనే రాజుకథ చెబుతాను. శ్రమతెలియకుండా విను,'' అంటూ యిలా చెప్పసాగాడు:

శ్రీపురనగర రాజైన వసంతసేనుడి కుమార్తె చంద్రావతి అపూర్వ సౌందర్య

## బేతాళ కథలు



వతి అని పేరు కెక్కింది. ఆమెను చూసినవారందరూ, అటువంటి సౌందర్యవతి నభూతో నభవిష్యతి అనసాగారు.

వసంతసేనుడికి ఒక ఆలోచన కలిగింది. అందం శాశ్వతంకాదు. వయసు పెరిగినకొద్దీ క్రమంగా తరిగిపోతుంది. ఈనాటి తన కుమార్తె రూపలావణ్యాలు అందరూ శాశ్వతంగా గుర్తుంచుకోవాలంటే, ఆమె రూపాన్ని ఏ చిత్రకారుడో చిత్రించాలి. అయితే, చంద్రావతి రూపం అద్భుతమైనది. అందువల్ల, ఆమె చిత్రాన్ని గీసే చిత్రకారుడు కూడా అద్భుతమైన కళానైపుణ్యం కలిగినవాడై వుండాలి!

వసంతసేనుడు తన ఆస్థానోద్యోగులను దేశదేశాలకు పంపి, కళాసాగరుడనే ఒక చిత్రకారుడిని రప్పించాడు. కళాసాగరుడి ప్రతిభను గురించి చాలా దేశాల్లో చెప్పుకునేవారు. అతడిలో ఏదో దైవాంశ వున్నదనీ, అందువల్లనే అతడి చిత్రాలు అంత గొప్పగా వుంటాయనీ అందరూ అనుకునేవారు.

వసంతసేనుడు, కళాసాగరుడికి సంగతి చెప్పి, చంద్రావతిని చూపించాడు. ఆమెను చూస్తూనే కళాసాగరుడు, "మహాప్రభూ! ఇటువంటి రూపసి చిత్రం గీసే అదృష్టం అందరికీ లభ్యం కాదు. నేనీమెను చిత్రిస్తాను; కాని, అందులో జీవకళ ఉట్టి పడాలంటే, ఈమెకు సంబంధించిన గత మూడు తరాల చరిత్ర నాకు వివరంగా కావాలి." అన్నాడు.

కళాసాగరుడి మాటలు వింటూనే వసంతసేనుడు విస్తుపోయాడు. దానికి కారణం వున్నది. ఒకానొక చిన్న రాజు అడవికి వేటకు వెళ్ళి, అక్కడ ఒక కోయ యువతిని చూసి ప్రేమించి, తన రాణిగా చేసుకున్నాడు. వారికి జన్మించింది చంద్రావతి తల్లి. ఇది రాజవంశీయులు మాత్రమే ఎరిగివున్న రహస్యం. దీన్ని సామాన్యులకు తెలియనివ్వడం వసంతసేనుడికి యిష్టంలేదు.

రాజు తటపటాయించడం గమనించిన కళాసాగరుడు, "తమరు రాకుమార్తెకు సంబంధించిన మూడు తరాల గతచరిత్ర నాకు చెప్పడం యిష్టంలేని పక్షంలో, చిత్రసాగరు డనే నా సోదరుణ్ణి పిలిపించండి. అతడు మీ కుమార్తె అద్భుత సౌందర్యాన్ని గత చరిత్ర అడక్కుండానే వాస్తవంగా చిత్రించగలడు," అన్నాడు.

వసంతసేనుడు చిత్రసాగరుణ్ణి పిలిపించాడు. అతడు రాజుతో, "నేను రాకుమారి చిత్రం గీయగలను. కాని, ముందుగా నేను ఆమెతో ఏకాంతంగా మాట్లాడే అవకాశం యివ్వాలి," అన్నాడు.

"ఎందుకు?" అన్నాడు వసంతసేనుడు ఆశ్చర్యపోతూ.

"నేను ఎవరితోనైనా ఏకాంతంగా మాట్లాడానంటే, వారి గత మూడు తరాల చరిత్రనూ క్షుణ్ణంగా తెలుసుకోగలను. గొప్పలు చెప్పుకోవడంకాదు—అది భగవంతుడు నాకు ప్రసాదించిన శక్తి!" అన్నాడు చిత్రసాగరుడు.

చరిత్ర చెప్పమని అడిగాడు కళాసాగరుడు. ఆ చరిత్ర ఏదో తానే తెలుసుకోగలనంటున్నాడు, చిత్రసాగరుడు. మొత్తం మీద యిద్దరికీ చరిత్ర కావాలి! తన ఇంటి రహస్యం ఇతరులకు తెలియనివ్వడం ఏమాత్రం యిష్టం లేని రాజు,



యిప్పుడేం చేయడమా అని ఆలోచించసాగాడు.

రాజు వాలకం గమనించిన చిత్రసాగరుడు, "ప్రభూ! మీరు తలపెట్టిన కార్యం నా సోదరుడు రేఖాసాగరుడి వల్ల కాగలదు. చరిత్రతో పనిలేకుండా చిత్రం గీయడం అతడికే సాధ్యపడుతుంది," అన్నాడు.

వసంతసేనుడు, రేఖాసాగరుణ్ణి పిలిపించాడు. అతడు రాజు కోరిన ప్రకారం చంద్రావతి చిత్రపటం తయారుచేశాడు. దాన్నిచూసి ఆమె అబ్బురపాటుచెందింది. అది అద్దంలో ఆమె ప్రతిబింబంలా వున్నది. రాజు అతణ్ణి ఘనంగా సన్మానించాడు.

రేఖాసాగరుడు, రాజు వద్ద సెలవు తీసుకుని బయలుదేరే సమయంలో, "నా శక్తి కొద్దీ తమ కుమార్తెను చిత్రించాను. కాని, అందులో జీవకళ లేదు. జీవకళ ఉట్టి పడేలా చిత్రాన్ని గీసే సామర్థ్యం నా అన్న లిద్దరికి మాత్రమే వున్నది," అన్నాడు.

వసంతసేనుడు తిరిగి ఆలోచనలో పడ్డాడు. మంత్రుల్లో ఒకడు ఆయనకు లోగడ కళాసాగరుడు ఆనందచక్రవర్తి బొమ్మ గీసినట్టు చెప్పాడు. దానితో ఆయనకు ఒక ఉపాయం తోచి, కళాసాగరుణ్ణి పిలిపించి, "నువ్వు, ఆనంద చక్రవర్తి బొమ్మ గీసినట్టు తెలిసింది. అంటే, నీకు ఆయన చరిత్ర పూర్తిగా తెలిసి వుండాలి. ఆ తెలిసినదంతా నాకు చెప్పగలవా ?" అని అడిగాడు.

"చెప్పలేను, ప్రభూ !" అన్నాడు కళాసాగరుడు.

"ఎందువల్ల ? అది రహస్యమా ?" అని అడిగాడు రాజు.

"ఆ సంగతి చెప్పలేను. నాకు తెలిసిన చరిత్ర నేను గీసే చిత్రంలోకి వెళ్ళిపోతుంది. ఆపైన నా మెదడులో ఆచరిత్రకు సంబంధించిన చిన్న అంశం కూడా మిగలదు," అన్నాడు కళా సాగరుడు.

ఈ సమాధానానికి వసంతసేనుడు ఎంతో తృప్తి పడ్డాడు. ఆయన కళాసాగరుడికి తన కుమార్తెకు సంబంధించిన మూడు తరాల గత చరిత్ర వివరించాడు.



ఆ మర్నాడు కళాసాగరుడు, రాకుమారిని ఆమె తల్లిదండ్రుల సమక్షంలోనే ఎదుటబెట్టుకుని, కొద్ది గంటల్లో ఆమె చిత్రపటాన్ని తయారుచేశాడు. దాన్ని చూసి అందరూ ఆశ్చర్యపోయారు. అది చంద్రావతి ప్రతిబింబం వలె కాక, అచ్చు చంద్రావతి లాగా వున్నది. దానిముందు రేఖాసాగరుడి చిత్రం వెలవెలబోతున్నది.

రాజు పరమానందం చెంది కళాసాగరుడికి గొప్ప, గొప్ప బహుమతులిచ్చాడు. ఆ సమయంలో చిత్రసాగరుడు రాజుతో, ''ప్రభూ! చంద్రావతి సౌందర్యం అద్భుతమైనది. ఆ అందాన్ని చిత్రించే అవకాశం నాకూడా యివ్వవలసిందిగా కోరుతున్నాను,'' అన్నాడు.

''నువ్వు, రాకుమారితో ఏకాంతంగా మాట్లాడాలన్నావు. అందువల్ల, నీ కోర్కె నెరవేరే అవకాశం లేదు,'' అన్నాడు రాజు.

''ఇప్పుడది అవసరం లేదు. నా అన్న కళాసాగరుడు వేసిన చిత్రంతో ఒక్కరోజు ఏకాంతంగా గడిపే అవకాశం నా కివ్వండి. అప్పుడామె గత చరిత్ర అంతా నేను తెలుసుకోగలను,'' అన్నాడు చిత్రసాగరుడు.

చిత్రసాగరుడితో కూడా తన చిత్రం గీయించుకోవాలని చంద్రావతి ఉబలాటపడింది. రాజు అందుకు ఒప్పుకోలేదు. ఆయన చిత్రసాగరుణ్ణి ఉచిత రీతిలో సన్మానించి పంపివేశాడు. తర్వాత కళాసాగరుడు గీసిన చిత్రాన్ని అంతఃపురానికి



పంపి, రేఖాసాగరుడు వేసిన చిత్రాన్ని పదిమందీ చూసే ప్రదర్శనశాలలో పెట్టించాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, వసంతసేనుడి ప్రవర్తన అనుచితంగానూ, ఒక గొప్ప కళాకారుడి పట్ల అవమానకరంగానూ కనిపించడం లేదా? చిత్రసాగరుడు, రాకుమారితో గాక, తన సోదరుడు వేసిన ఆమె చిత్రంతో ఒకరోజు ఏకాంతం కోరాడు. ఇందుకు రాజు అభ్యంతరం చెప్పవలసిన అవసరం ఏమున్నది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వసంతసేనుడి ప్రవర్తనలో అనుచితం, అవమానకరం అయినదేమీ లేకపోగా, చిత్రసాగరుడు మరొకసారి రాకుమారి చిత్రం గీయాలన్న కోరిక వెళ్ళబుచ్చడమే అనుచితంగా, అనాగరికంగా నాకు కనబడుతున్నది. రాజవంశపు చరిత్రల్లో మంచితో పాటు చెడు కూడా వుండడం అసహజమేం కాదు. చెడ్డను దాచి, మంచిని మాత్రం ప్రచారం చేసుకోవడం రాజలక్షణం. కళాసాగరుడు రాజవంశపు చరిత్ర తెలుసుకున్నప్పటికీ, చిత్రం పూర్తయిన వెంటనే ఆ చరిత్రనంతా మరిచిపోతాడు. కాని, చిత్రసాగరుడు అలా కాదు, చిత్రాన్ని చూసి చరిత్ర తెలుసుకుంటాడు. అది అతడి మనసులోనే వుండిపోతుంది. దాన్ని అతడెవరితోనైనా చెప్పే ప్రమాదం వున్నది. అందుకే అతడికి తన కుమార్తె చిత్రం గీసేందుకు రాజు అనుమతించలేదు. అంతేకాక, ముందు జాగ్రత్తగా కళాసాగరుడు గీసిన చిత్రాన్ని అంతఃపురానికి పంపివేశాడు. దాన్ని ప్రదర్శన శాలలో పెడితే, ఆ చిత్రాన్ని చూసి ఆమె గత చరిత్ర గ్రహించే బుద్ధిశాలులు మరెవరైనా వుండవచ్చు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)





# సరైన సమాధానం

నాగలాపురం రాకుమారి నాగవల్లి, అందచందాలలోనే కాక, తెలివితేటల్లో కూడా సాటిలేనిదని అందరూ చెప్పుకునేవారు. తనకు మగసంతానం లేకపోవడం వల్ల రాజు నాగేంద్రవర్మ, ఆమెకు మామూలు చదువుసంధ్యలతోపాటు రాజోచిత విద్యలు కూడా నేర్పించాడు.

నాగవల్లికి పెళ్ళీడు రాగానే ఎందరో రాజకుమారులు ఆమెను వివాహమాడేందుకు ఉత్సాహపడసాగారు. నాగేంద్రవర్మ కుమార్తెకు ఒకరిద్దరు రాజకుమారులను గురించిచెప్పి, వారిలో ఎవరిని వివాహమాడేందుకు యిష్టమని అడిగాడు.

దానికి నాగవల్లి, "నాన్నా, నా వివాహ విషయమై, మీరేమీ తొందరపడకండి. నన్ను వివాహమాడదలిచిన వారందరిలో తెలివైనవాణ్ణీ, ధైర్యవంతుణ్ణీ మాత్రమే నేను భర్తగా స్వీకరిస్తాను," అన్నది.

"నీ నిశ్చయం బాగానే వున్నది. కాని, అలాంటివాణ్ణి తెలుసుకోవడం ఎట్లా?" అని అడిగాడు రాజు. "మీరు, నా స్వయంవరం ప్రకటించండి. వచ్చిన రాజకుమారులను నేను మూడు ప్రశ్నలడుగుతాను. వాటికి సరైన సమాధానాలిచ్చిన రాజకుమారుణ్ణి వివాహమాడతాను," అన్నది నాగవల్లి.

నాగేంద్రవర్మ కుమార్తె స్వయంవరం ప్రకటించాడు. వివిధ రాజ్యాల నుంచి చాలామంది రాజకుమారులు వచ్చారు.

స్వయంవర మంటపంలో రాజు నాగేంద్రవర్మ సింహాసనం మీద కూర్చున్నాడు. దిగువగా రెండు ఉన్నతాసనాల మీద రాకుమారి నాగవల్లీ, రాజగురువూ కూర్చున్నారు. వారికి ఎదురుగా రాజకుమారులందరూ ఆసీనులయ్యారు.

రాజగురువు సభ నుద్దేశించి, "రాకుమారి అడగబోయే మూడు ప్రశ్నలూ, ఆమె

రాజ్ కుమార్

తరఫున నేను అడుగుతాను. వాటికి సరైన సమాధానాలేమిటో ఆమే నిర్ణయిస్తుంది.'' అని, నాగవల్లిని, ''ఏమిటమ్మా, ఆ ప్రశ్నలు ?'' అని అడిగాడు.

నాగవల్లి ఒక చిన్న తాళపత్రాన్ని రాజ గురువుకు యిచ్చింది. ఆయన దానికేసి ఒకటి, రెండు క్షణాలు చూసి, ''చాలా వజ్రకఠినమైన ప్రశ్నలే!'' అని, రాజ కుమారులతో, ''మా రాకుమారి అడగ దలచిన మూడు ప్రశ్నలూ యివి : బరువు లేని వస్తువు ఏది? కనబడని ఆకారం ఏది? గాలి పీల్చని ప్రాణి ఏది?'' అన్నాడు.

ఆ ప్రశ్నలు విని కొందరు తెల్లబోయారు. మరికొందరు ఓటమిని ఒప్పుకుంటూ తలలు దించుకున్నారు. ఇంకా కొందరు ఏవేవో సమాధానాలు చెప్పడానికి ప్రయత్నించారు గాని, అవేవీ రాకుమారికి నచ్చలేదు.

ఇదంతా చూస్తూ మౌనంగా కూర్చున్న వీరపురం రాకుమారుడు వసంతనాగుడు, ఆసనంలోనుంచి లేచి నిలబడి, ''రాకు మారి అడిగిన ప్రశ్నలకు ఎవరూ సరైన సమాధానం చెప్పలేకపోయారన్న మాట నిజం. దానికి బలమైన కారణమే వున్నది. బరువులేని వస్తువూ, కనబడని ఆకారం, గాలిపీల్చని ప్రాణీ సృష్టిలోనే మనకు కనిపించవు. అందువల్ల ఆ ప్రశ్నలే అర్థం లేనివి!'' అన్నాడు.

ఆ మాటలకు సభలో కలకలం బయలు దేరింది. కొందరు వసంతనాగుడు, రాకు మారి తెలివితేటలను కించపరిచినట్టు భావించి, అతడి కేదో కీడు రానున్నదను కున్నారు. కాని, నాగవల్లి మందహాసం చేస్తూ, వసంతనాగుణ్ణి సమీపించి, ''నా ప్రశ్నలు అర్థంలేనివన్న మాట నిజం! అయినా, కొందరు వాటికేవో సమాధానా లున్నవనుకుని భ్రమపడ్డారు. మరి కొందరికి అవి అర్థంలేని ప్రశ్నలని తెలిసి వుండవచ్చు. కాని ఆ మాట చెప్పేందుకు ధైర్యం చేయలేకపోయారు. ఆ రెండూ చేసిన వీరపుర రాకుమారుణ్ణి, నేను వరిస్తు న్నాను,'' అని, చెలికత్తె అందించిన పూల మాలను వసంతనాగుడి మెడలో వేసింది.





# అందరికీ లాభమే!

రంగన్నతాత వయసులో వుండగా, చాలా తెలివైన వాడని తన గ్రామంలోనే కాక చుట్టుపక్కల గ్రామాల్లో కూడా పేరు మోశాడు. ఇతర్లకు పెద్ద నష్టమంటూ కలక్కుండా, ఆయన తన పనులు చక్కదిద్దుకునేవాడు.

ఒకసారి డబ్బు అవసరం అయిందని చెప్పి రంగన్నతాత, తన కూతురుకు చేయించిన బంగారు గొలుసును వడ్డీ వ్యాపారి భూషయ్య దగ్గిర తాకట్టు పెట్టి, ఎనిమిది వందల రూపాయిలు తీసుకున్నాడు. ఎన్నాళ్ళకూ గొలుసు విడిపించుకోకపోవడంతో భూషయ్య, రంగన్నతాత మీద వత్తిడి తేసాగాడు. అయితే, ప్రతిసారీ రంగన్నతాత ఏదో ఒక సాకుతో డబ్బు సర్దుబాటు కావడం లేదని చెప్పి, అతని దగ్గిర మరికొంత గడువు కోరసాగాడు.

తరవాత రంగన్నతాత మీద భూషయ్య వత్తిడి మరింత ఎక్కువయింది. రంగన్నతాత కొన్నాళ్ళు అతడికి మొహం తప్పించి తిరిగాడు. అతడు పంపిన నౌకరు ఇంటికి వచ్చినప్పుడు, ఇంట్లో వుండే లేదని చెప్పించాడు. అంతగా నౌకరు కంటబడితే, మరికొంత గడువు కావాలని యజమానికి చెప్పమనేవాడు. చేసేదిలేక భూషయ్య యిలా చాలా గడువులకు ఒప్పుకున్నాడు.

ఇలా గడువులు యిచ్చి విసిగిపోయిన భూషయ్య, స్వయంగా రంగన్నతాత వద్దకు వచ్చి, మరి మూడురోజులు గడువిచ్చి, ఆ లోపల డబ్బుకట్టి గొలుసు తీసుకోకపోతే, దాన్ని అమ్మి తన బాకీ కింద జమకట్టుకుంటానన్నాడు.

ఆ తరవాత మూడురోజులు గడిచినా రంగన్నతాత, భూషయ్యకు కనిపించలేదు, డబ్బు చెల్లించలేదు.

షేక్ గాలిబ్



బాగా విసిగిపోయిన భూషయ్య, గొలుసును నగలవ్యాపారి నాగరాజుకు యిచ్చి, "ఈ గొలుసు వెయ్యి రూపాయిలకు తాకట్టు పెట్టుకున్నాను. పన్నెండు వందలకు తక్కువ అయితే మాత్రం అమ్మకు," అని చెప్పాడు.

ఒకరోజు నాగరాజు నగల కొట్టుకు, ఆ ఊరి జమీందారు వచ్చాడు. నాగరాజు, భూషయ్య యిచ్చిన గొలుసును జమీందారుకు చూపి, "అయ్యా, ఈ గొలుసు పనితనం చూశారు గదా, రెండు వేలకు తక్కువ చెయ్యదు! పెద్దలు, తమకు పదిహేను వందలకే యిస్తాను, ఏమంటారు?" అన్నాడు.

జమీందారు, నాగరాజుకు పదిహేను వందలు యిచ్చి గొలుసు తీసుకున్నాడు. నాగరాజు అందులో మూడు వందలు సొంతం చేసుకుని, గొలుసును పన్నెండు వందలకు అమ్మానని చెప్పి, భూషయ్యకు ఆ మొత్తం యిచ్చాడు.

జమీందారు తన దగ్గిర పని చేస్తున్న దేవయ్య కూతురు పెళ్ళికి గొలుసును కట్నంగా యిస్తూ, నగల వ్యాపారి నాగరాజు అన్న మాట నమ్మి, "దేవయ్యా, మీ అమ్మాయిని యీ గొలుసు విషయమై కాస్త జాగ్రత్తగా వుండమను. దీని ఖరీదు కాస్తా కూస్తా కాదు; రెండు వేలు!" అన్నాడు.

ఆ గొలుసు తీసుకుని దేవయ్య పొంగిపోయాడు. అతడు కొద్దిరోజుల క్రితమే కూతురు పెళ్ళి కోసం రంగన్నతాత దగ్గిర ఐదు వందలు అప్పు చేశాడు.

దేవయ్య, రంగన్నతాత దగ్గిరకు వెళ్ళి, గొలుసు అతడికిచ్చి, "ఇది చాలా విలువయింది. ఇలాంటి విలువైన నగలమ్మడం, నాకు తెలియదు. నువ్వు దీన్ని అమ్మి, నీ ఐదు వందలబాకీ జమ కట్టుకుని, మిగిలింది నాకివ్వు," అన్నాడు.

రంగన్నతాత గొలుసు చూసి కలవరపడిపోతూ, "అసలీ గొలుసు నీ కెక్కడిది?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు దేవయ్య కోపంగా, "ఇదేం దొంగిలించి తెచ్చాననుకుంటున్నావా? జమీందారుగారు నా కూతురు పెళ్ళికి చదివించిన కట్నం. ఆయనే చెప్పారు, రెండు వేలకు కొన్నట్టు!" అన్నాడు.

"అలాగా!" అని రంగన్నతాత, దేవయ్యను వెంటబెట్టుకుని బసవాచారి దగ్గిరకు పోయి, గొలుసును గీటు వేసి, దాని నిగ్గు తేల్చమన్నాడు.

బసవాచారి గీటు వేసి చూసి, "ఆహాఁ, మేలిమి బంగారం!" అన్నాడు.

ఆ మాట విని దేవయ్య ఉత్సాహంగా రంగన్నతాతతో, "విన్నావా? జమీందారు గారే మోసం చేశారనుకున్న, నీ బుద్ధె లాంటిది!" అన్నాడు.

రంగన్నతాత, బసవాచారిని గొలుసుకు మరి కాస్త లోతుగా గీటుపెట్టి చూడ మన్నాడు. బసవాచారి అలా చేసి ఆశ్చర్య పోతూ, "ఇది పైన మందంగా బంగారు పూత పూసిన గొలుసు. అమ్మితే, ఐదు వందల కన్న ఎక్కువ రాదు," అన్నాడు.

ఆ మాటలకు దేవయ్య నీరుగారి పోయాడు.

"సరే, దేవయ్యా! జమీందారుగారి దగ్గిరకు పోయి, యిలా మోసం చేశా రెందుకని అడుగుతావా?" అని ప్రశ్నిం చాడు రంగన్నతాత.

"బాబో, అంతమాటే! పెద్దవాళ్ళు, ఏం చేసినా, చెల్లుబడి అయిపోతుంది," అన్నాడు దేవయ్య.



"ఆ మాటా నిజమే! నిన్ను చూస్తే నాకు ఎక్కడలేని జాలేస్తున్నది. నీ బాకీ ఐదు వందల కింద దీన్ని జమకట్టు కుంటాను," అని రంగన్న తాత గొలుసు తీసుకుని బయలుదేరాడు.

ఇదంతా బసవాచారి దుకాణంలో కూర్చుని విన్న రంగన్నతాత స్నేహితుడు గురవయ్య, గబగబా పోయి అతణ్ణి కలుసు కుని, "ఏరా, రంగన్నా, నీకేమన్నా పిచ్చి పట్టిందా? బసవాచారి అన్నాడే అనుకో, అయినా బంగారు పూత పూసిన ఆ గొలుసు ఐదు వందలు చేస్తుందని నమ్మకమేమిటి? ఆ నకిలీగొలుసు దేవయ్యకే యిచ్చి, వీలుపడినప్పుడే నీ బాకీ చెల్లించమనక పోయావా?" అన్నాడు.

ఆ ప్రశ్నకు రంగన్నతాత కనుబొమలు ఎగరవేసి, "నేనీ గొలుసు తీసుకోకపోతే, దేవయ్య ఏదో ఒకనాడు నోరుజారి జమీం దారుతో ఇది నకిలీ గొలుసని అనేస్తాడు. దానితో జమీందారు దీని పుట్టుపూర్వోత్తరా లేమిటని ఆరా తీస్తాడు. తీగ లాగితే డొంకంతా కదిలినట్టు, అటు తిరిగీ, యిటు తిరిగీ నా, పీకల మీదికి వస్తుంది!" అన్నాడు.

"అదెలా?" అన్నాడు గురవయ్య ఎక్కడలేనంతగా ఆశ్చర్యపోతూ.

"ఎలాగేమిటి! నేను రెండు వందల యాభై రూపాయిలు ఖర్చుపెట్టి, సామా న్యంగా ఎవరూ కనుక్కోని విధంగా యీ నకిలీ గొలుసు చేయించాను. దీన్ని వడ్డీ వ్యాపారి భూషయ్య దగ్గిర ఎనిమిది వందలకు కుదవపెట్టాను," అంటూ రంగన్నతాత, గురవయ్యకు జరిగిన దంతా చెప్పి, "ఇప్పుడు యిన్ని చేతులు మారి, యీ నకిలీ గొలుసు తిరిగి నా దగ్గి రకే వచ్చింది. ఫరవాలేదు, వచ్చినదాంట్లో కొంత లాభం పోయిందనుకుంటాను. నువు మాత్రం ఈ సంగతి మరెక్కడా అనకు!" అన్నాడు.

అంతా విన్న గురవయ్య పెద్దగా నవ్వి, "ఇందులో నష్టపోయినవాళ్ళెవరూ లేరు. అందరికీ లాభమే!" అన్నాడు.





# గజరాజు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో, కాశీనగరానికి కొంత దూరంలో ఒక వడ్రంగుల గ్రామం ఉండేది. అందులో అయిదు వందల మంది వడ్రంగులుండేవారు. వారు చిన్న చిన్న పడవలలో బయలుదేరి, ఒక అరణ్యానికి వెళ్ళి, అక్కడ చెట్లు పడగొట్టి, కలప కోసి, పడవలలో తెచ్చుకుంటూ వుండేవారు. ఆ కలప ఖర్చయిపోగానే మళ్ళీ అందరూ కలిసి అరణ్యానికి వెళుతూ వుండేవారు.

ఈ అరణ్యంలోనే ఒక మూల ఒక ఆడ ఏనుగు వుంటూండేది. ఒకనాడు దాని కాలిలో పెద్ద పేడు దిగబడింది. దాని ఫలితంగా ఏనుగు కాలు వాచి సలుపు పెట్ట నారంభించింది. ఎంత ప్రయత్నించినా ఆ పేడును తీయటం సాధ్యం కాలేదు. ఇంతలో దానికి వడ్రంగులు చెట్లు కొట్టే చప్పుడూ, కలప కోసే చప్పుడూ వినిపించింది. అది కుంటుతూ వారున్న చోటికి వెళ్ళింది.

ఏనుగును చూడగానే దానికేదో బాధ కలిగిందని గ్రహించి, వడ్రంగులు తాము చేసే పని కట్టిపెట్టారు. ఏనుగు వారి ముందు పడుకున్నది. దాని కాలు వాచి ఉండటం వల్ల అందులో ఏదో గుచ్చుకున్నట్టు తెలుసుకుని, వడ్రంగులు తమ ఉలులతో ఉపాయంగా పేడును బయటికి లాగి, గాయానికి చికిత్సచేశారు.

త్వరలోనే ఏనుగు కాలు బాగయింది. అది మొదలు ఆ ఏనుగు వడ్రంగులకు సాయపడ సాగింది. అది పడిపోయిన చెట్లను తీసుకువచ్చేది, దుంగలను దొర్లించేది, కోసిన పలకలను నదిలో పడవల వద్దకు చేరవేసేది. ఆ యేటి కాయేడు వడ్రంగులకూ ఏనుగుకూ మధ్య స్నేహం



పెరిగింది. అయిదు వందలమంది వడ్రంగులూ తమ ఆహారంలో తలా కాస్తా తీసి ఏనుగుకు పెట్టేవాళ్ళు.

కాలక్రమాన ఈ అడవి ఏనుగుకు ఒక పిల్ల కలిగింది. అది ఐరావతం జాతిది, తెల్లగా ఉండేది. ఆడ ఏనుగు ముసలిదై పోయాక, అది తన పిల్లను తెచ్చి వడ్రంగులకు అప్పగించి, తాను అరణ్యంలోకి వెళ్ళిపోయింది. ఇప్పుడీ తెల్ల ఏనుగు వండ్రంగులకు తోడ్పడుతూ, వారిచ్చే ఆహారాన్ని తింటూ, వారి పిల్లలను తన వీపుమీద ఎక్కించుకుని తిప్పుతూ, నదిలో స్నానం చేయిస్తూ ఉల్లాసంగా కాలం వెళ్ళబుచ్చుతున్నది. వడ్రంగులు ఆ ఏనుగు పిల్లను ఎంతో ప్రేమతో చూసుకుంటున్నారు.

అరణ్యంలో ఈ తెల్ల ఏనుగు ఉన్నదని తెలిసి, దాన్ని ఎలాగైనా పట్టుకుందామని బ్రహ్మదత్తుడు సపరివారంగా అరణ్యానికి వచ్చాడు. వడ్రంగులు రాజును చూసి, ఆయన కలప కోసం వచ్చాడనుకుని, "మహారాజా, శ్రమపడి తామే వచ్చారెందుకు? కలప కావలిస్తే మేము తెచ్చి ఇవ్వకపోయామా?" అన్నారు.

"నేను కలపకోసం రాలేదు. ఈ తెల్ల ఏనుగుకోసం వచ్చాను," అన్నాడు రాజు.

"అయితే తీసుకు వెళ్ళండి!" అన్నారు వడ్రంగులు వినయంగా.

కాని ఎంతకీ ఏనుగు కదలలేదు. రాజు వెంట వచ్చిన వారిలో ఒకడు, "మహారాజా, ఇది వివేకంగల జంతువు. దానిని తమరు తీసుకుపోతే ఈ వడ్రంగులకు నష్టం కలుగుతుంది. వారికి పరిహారం ఇస్తేనేగాని అది కదలదు!" అన్నాడు.

రాజు ఏనుగు నాలుగు కాళ్ళదగ్గిరా, తొండం దగ్గిరా, తోకదగ్గిరా ఒక్కొక్క లక్షవరహాలు చొప్పున పెట్టి, వడ్రంగులను తీసుకోమన్నాడు. అప్పటికీ ఏనుగు కదలలేదు. వడ్రంగుల భార్యలకూ, పిల్లలకూ బట్టలు పెట్టినాక అది కదిలి రాజు వెంట నగరానికి వెళ్ళిపోయింది.

ఏనుగును మేళ తాళాలతో నగరంలోకి తీసుకుపోయారు. వీధులన్నీ ఊరేగించారు. తరవాత దానిని ఒక ప్రత్యేకమైన శాలలో ఉంచారు. అది పట్టపు ఏనుగు అయింది, దానిమీద రాజుగారు తప్ప ఇంకెవరూ ఎక్కటానికి వీలులేదు.

ఈ ఏనుగు వచ్చాక కాశీరాజ్యం చాలా విస్తరించింది. దాని ప్రభావం వల్ల యెంత బలవంతులైన రాజులు కూడా కాశీ రాజుకు ఓడిపోయారు.

కొంత కాలానికి రాజు భార్య గర్భవతి అయింది. ఆమె కడుపున బోధిసత్వుడు ప్రవేశించాడు. ఇంకొక వారానికి రాణి ప్రసవిస్తుందనగా రాజు చనిపోయాడు. ఇదే సమయమనుకుని కోసల దేశపు రాజు తన సైన్యాలతో కాశీరాజ్యంపైకి దండెత్తి వచ్చాడు. ఏం చెయ్యాలో మంత్రులకు పాలుబోలేదు. వారు చాలా సేపు తమలో తాము చర్చించుకుని, చివరకు కోసలరాజుకు ఈ విధంగా కబురు పంపారు: "మా రాణీగారు ఒక వారం లోపల ప్రసవిస్తుంది. ఆమె ఆడపిల్లను కన్నట్టయితే మీరు వచ్చి కాశీరాజ్యాన్ని ఆక్రమించుకోండి. మగపిల్లవాడు కలిగిన పక్షంలో మేము మీతో యుద్ధం చేస్తాం!"

కోసలరాజు ఈ కబురు అందుకుని, వారం రోజులు గడువిచ్చాడు.

వారం గడవగానే మహారాణి బోధిసత్వుణ్ణి ప్రసవించింది. కాశీ సేనలు కోసల సేనలతో యుద్ధానికి తలపడ్డాయి.



కాని యుద్ధంలో కోసలసేనలదే పైచేయిగా కనిపించింది. అప్పుడు మంత్రులు మహారాణి వద్దకు వెళ్ళి, "అమ్మా, మన పట్టపు ఏనుగు యుద్ధరంగంలో ప్రవేశిస్తేనే గాని మనకు విజయం చేకూరదు. కాని మహారాజు మరణించినది మొదలు ఏనుగు నిద్రాహారాలు మాని దుఃఖంలో మునిగివున్నది," అని విన్నవించారు.

ఈ మాటలు వింటూనే మహారాణి పురిటి మంచం మీదనుంచి లేచింది. తన కుమారుడికి రాజోచితమైన దుస్తులు తొడిగింది. ఆమె తన కుమారుణ్ణి ఏనుగు కాళ్ళముందు పెట్టి నమస్కారం చేసి, "గజరాజా, నీ యజమాని పోయినందుకు విచారించవద్దు, ఇదిగో నీయజమాని! వీడి శత్రువులు యుద్ధరంగంలో చెలరేగుతున్నారు. నీవు వెళ్ళి వారిని ఓడించు; లేదా నీ కాళ్ళకింద ఈ కుర్రవాణ్ణి తొక్కి చంపెయ్యి," అన్నది.

అంతవరకూ విచారంగా వున్న ఏనుగు పిల్లవాడి శరీరాన్ని తన తొండంతో ప్రేమగా తడివింది. అతణ్ణి తొండంతో ఎత్తి తన శిరస్సుమీద పెట్టుకున్నది. తరువాత అతణ్ణి తల్లి చేతుల్లో పెట్టి వెంటనే యుద్ధరంగానికి కదిలిపోయింది.

ఏనుగు భీకరంగా ఘీంకరిస్తూ వాయువేగంతో తమపైకి వచ్చి పడుతూండటం చూసి, కోసల సైనికుల గుండెలు అవిసిపోయాయి. వారు చెల్లాచెదరుగా పారిపోసాగారు. ఏనుగు నేరుగా కోసలరాజు వద్దకు వెళ్ళింది. అతణ్ణి తొండంతో చుట్టి తీసుకువచ్చి రాజకుమారుడి పాదాల వద్ద పడవేసింది. కోసలరాజు పసివాడి కాళ్ళు అంటుకుని క్షమాపణ వేడుకున్నాడు. కాశీ మంత్రులు అతనికి ఎట్టి అపకారమూ చేయక, అతని దుశ్చర్యను క్షమించి తన దేశానికి తిరిగి పోనిచ్చారు.

బోధిసత్వుడు ఏడేళ్ళవాడయేదాకా ఏనుగు కాశీరాజాన్ని కాపాడింది. తరవాత బోధిసత్వుడు సింహాసనానికి వచ్చి ఆ ఏనుగును తన పట్టపుటేనుగు చేసుకుని, రాజ్యపాలన చేశాడు.





# గురునానక్

లాహోర్ సమీపంలో ప్రస్తుతం నాన్ కానా అని ప్రసిద్ధిగాంచిన తల్వాన్‌డీ గ్రామంలో తృప్త, కల్యాణ్‌చంద్ దంపతులకు 1469వ సంవత్సరం ఏప్రిల్ 15న ఒక మగశిశువు జన్మించాడు. జ్యోతిష్కులు ఆ శిశువు మునుముందు మహాపురుషుడు కాగలడని చెప్పి నానక్ అని నామకరణం చేశారు.

బిడ్డ పెరిగి బాలుడై బడికి వెళ్ళడం ప్రారంభించాడు. ఒకరోజు తరగతిలో ఉపాధ్యాయుడు అ ఆ లు నేర్పే సమయంలో బాల నానక్ దాన్నేమీ పట్టించుకోకుండా తన పలకలో ఏదో రాసుకుంటూ కనిపించాడు. ఉపాధ్యాయుడు దగ్గరికి వెళ్ళి చూస్తే ఆ పలకలో దేవుని మీద సంపూర్ణ ప్రార్థనా గీతం వుంది. ఆ అద్భుతానికి ఉపాధ్యాయుడు ఆశ్చర్యం చెందాడు.





తండ్రి కల్యాణ్ సింగ్ కుమారుని వ్యాపారంలోకి దించాలని ప్రయత్నించాడు. ఒకరోజు నానక్‌కు డబ్బిచ్చి, పట్నం వెళ్ళి వ్యాపారం చేయడానికి సరుకులు తెమ్మన్నాడు. అడవి మార్గం గుండా వెళుతున్న నానక్‌కు ఆకలితో కొందరు సాధువులు కనిపించారు. తండ్రి ఇచ్చిన డబ్బుకు ఆహారపదార్థాలు కొని తెచ్చి, సాధువులకు పంచిపెట్టాడు.



పెళ్ళి చేస్తేనైనా సంసార జీవితం పట్ల ఆసక్తి చూపగలడన్న ఉద్దేశంతో కల్యాణ్‌చంద్ నానక్‌కు పెళ్ళి చేశాడు. అతడు ఇద్దరు కొడుకుల తండ్రి అయ్యాడు తప్ప అతని ఆలోచనలు మాత్రం లౌకికజీవితం వైపు మళ్ళ లేదు. తరచూ ఏవో భక్తిగీతాల రచనలో లీనమైపోయేవాడు. "పైనుంచి నాకు అందే మాటలనే నేను రాస్తాను," అనే వాడు.

ఒకరోజు నానక్ భార్యతో, "అందర్నీ కాపాడే దేవుడే నిన్ను కూడా కాపాడుతాడు," అని చెప్పి దేశాటనకు బయలుదేరాడు. భారత దేశంలోని పవిత్రక్షేత్రాలను మాత్రమే కాకుండా, మర్దను డనే ముస్లిం మిత్రునితో కలిసి నేపాల్, టిబెట్, మక్కా, మదీనా మొదలైన స్థలాలకు తీర్థయాత్ర చేశాడు.





భక్తి లేకుండా పైపై మతాచారాలన పాటించే ప్రజలను నిరసించాడు నానక్ ఒకసారి హరిద్వారం వద్ద అర్ఘ్యమిస్తున్న వారిని చూసి తను పశ్చిమ దిశకు తిరి నీళ్ళు చల్లసాగాడు. "ఎందుకలా చేస్తున్నావు?" అంటే "లాహోర్‌లో వున్న నా చెట్లకు నీళ్ళు తోడుతున్నాను మీ రిచ్చే అర్ఘ్యం మీ పితృదేవతలకు చేరితే, నేను చల్లే నీళ్ళు మాత్ర నా తోటకు చేరవా ఏం?" అన్నాడు.

ఒకసారి నానక్ సయ్యద్‌పూర్‌లో ఒక పేదవాడి ఇంటికి అతిథిగా వెళ్ళాడు. అదే సమయంలో ఒక ధనికుడు వచ్చి తాను విందు జరుపుతున్నానని రమ్మని పిలిచాడు. నానక్ పేదవాడు ఇచ్చిన రొట్టెముక్కను కుడి చేతిలోనూ, ధనికుడు పెట్టిన రసభక్ష్యాన్ని ఎడమ చేతిలోనూ పట్టుకుని పిండాడు. కుడి చేతి నుంచి పాలూ, ఎడమ చేతి నుంచి నెత్తురూ కారాయట!





మక్కాలో వున్నప్పుడు నానక్ ఒకసారి కాబా వైపు కాళ్ళు సాచి పడుకున్నాడు. దాన్ని చూసిన కాజీ, "దేవుని ఆలయం వైపు కాళ్ళు చాపి పడుకున్నావేమిటి?" అని ప్రశ్నించాడు. నానక్ వెంటనే, "నా కాళ్ళు కాస్తా తీసి దేవుని ఆలయం లేని వైపుకి పెట్టకూడదూ?" అన్నాడు. నానక్ కాళ్ళను ఏ వైపుకు తిప్పినా ఆ వైపునే కాజీకి కాబా కనిపించిందట!

ప్రతి మనిషీ సహనం, దయ అలవరచుకోవాలని నానక్ ప్రచారం చేశాడు. కేవలం పైపై ఆచారాల నుంచి బయట పడి, హృదయ నైర్మల్యాన్ని అలవరచుకుని, సత్యస్వరూపుడైన దైవం పట్ల ప్రేమను పెంపొందించుకోవాలని ప్రబోధించాడు. జాతిభేదాలను నిరసించిన నానక్ బోధనలు హిందూ, ముస్లిం ఉభయ మతాలవారికీ ఉద్దేశింపబడినవి.





నానక్ బోధనలు శిక్కు మతంగా ప్రచారం పొందాయి. నానక్ ప్రథమ శిష్యుడు అంగదుని తన ఆధ్యాత్మిక వారసునిగా నియమించాడు. సత్యమే లక్ష్యంగా భావించి ఉజ్వలమైన జీవితం గడిపిన ఆ మహనీయుడు 1539 వ సంవత్సరం సెప్టెంబర్ ఏడున తన భౌతికకాయాన్ని త్యజించాడు.

నానక్ భక్తులు నిర్మించిన స్మారక మందిరం రావినదీ ప్రవాహంలో కొట్టుకు పోయింది. ప్రధానమైనది లక్ష్యమే గాని భౌతికచిహ్నం కాదన్న గురువు అభీష్టం మేరకే అలా జరిగిందని నానక్ భక్తులు విశ్వసిస్తారు. ఆయన చేసిన గీత రచనలు 'గ్రంథ్ సాహెబ్' (ఆదిగ్రంథం) అన్న నామంతో చిరస్థాయిగా నిలిచి పోయాయి.





నానక్ స్మృతిచిహ్నంగా అతని శిష్యులు నదీతీరంలో డేరా బాబానానక్ అనే పట్టణాన్ని నిర్మించారు. ఒకప్పుడు నానక్ ధ్యాననిమగ్నుడై ఆసీనుడైన స్థలంలో ఒక మందిరాన్ని కూడా నిర్మించారు. ఆ పట్టణాన్ని పవిత్రమైందిగా భావిస్తారు. గురునానక్ తర్వాత ఆయన ఎనిమిది మంది శిష్యులూ, ప్రశిష్యులూ గొప్ప సంప్రదాయన్ని నెలకొల్పారు.

# నీటి ఎద్దడి

గోపయ్య అనే యువకుడు కేశవరంలో చాలామందికి పాలు సరఫరా చేస్తూ, ఆ రాబడి ద్వారా సుఖంగా జీవయాత్ర సాగిస్తున్నాడు. అతడికి పక్కనే వున్న వీరవరంలో కూడా పాల వ్యాపారం వున్నది.

ఒకరోజున పరమేశం అనే కేశవరం గ్రామస్థుడు వీరవరం వెళ్ళి, అక్కడ గోపయ్య కేశవరంలో కన్న పాలు చవకగా అమ్ముతూండడం చూశాడు. పరమేశం గోపయ్య దగ్గిరే వాడుకగా పాలు కొంటూంటాడు.

"గోపయ్యా, యిది పచ్చి అన్యాయం! తోటి ఊరివాడివై వుండీ కేశవరంలో ఎక్కువ ధరకూ, యీ పొరుగూళ్ళో తక్కువ ధరకూ పాలమ్ముతున్నావు," అంటూ పరమేశం, గోపయ్య మీద ఖస్సుమంటూ లేచాడు.

గోపయ్య ఏమీ తొణక్కుండా, "మన ఊరి నీటి ఎద్దడి నీకు తెలియంది కాదు గదా? ఇక, యీ వీరవరం నీటిసమృద్ధికి పెట్టింది పేరు. పాల ఖరీదులో వచ్చే తేడాకు, అదే మూల కారణం!" అన్నాడు.

—జె. వి. రామారావు





# సహజమైన శంక

జమీందారు గోవిందరాయుడిగారి దివాణంలో వరదయ్య చిన్న ఉద్యోగి. అతడు డబ్బు విషయంలో ఎలాంటి చిక్కులూ వున్నట్టు కనబడేవాడు కాదు. పైగా, తన తోటి ఉద్యోగులకు అవసరం అయినప్పుడల్లా పదీపరకా అప్పుగా యిచ్చి ఆదుకునేవాడు. కొలువులో చేరి పదేళ్ళు తిరక్కుండానే నగరంలో ఒక చిన్న ఇల్లు కొనుక్కున్నాడు. కొడుకులిద్దర్నీ చక్కగా చదివించాడు. మంచి సంబంధం చూసి కూతురుకు పెళ్ళి కూడా చేసేశాడు.

వరదయ్య యీ పనులన్నీ ఎలా చేయగలుగుతున్నాడని, అతడి సహ ఉద్యోగులు ఎంత ఆలోచించినా అంతుబట్టేది కాదు. వాళ్ళంతా డబ్బు పరంగా యిబ్బందుల్ని ఎదుర్కుంటున్నవాళ్ళు. క్రమంగా వాళ్ళకు వరదయ్య మీద అనుమానాలూ, శంకలూ కలగసాగినై.

వాళ్ళు వరదయ్య గురించి రకరకాల పుకార్లు లేవదీశారు. దివాణానికి పనిమీద వచ్చేవాళ్ళనుంచి లంచాలు పుచ్చుకుంటున్నాడనేది, వాటిల్లో ఒకటి. చంగయ్య అనేవాడు జమీందారు ప్రధాన నౌకరు. వాడు యీ పుకార్ల సంగతి యజమానికి చెప్పాడు.

"వరదయ్య లంచం తీసుకుంటూ వుండగా చూసినవాళ్ళుగానీ, లంచం యిచ్చామని చెప్పినవాళ్ళుగానీ ఎవరైనా వున్నారా?" అని జమీందారు చంగయ్యను అడిగాడు.

"అయ్యా, ఆ రెండింటిలో దేనికి రుజువున్నా, యీ పుకార్లతో పనేమిటి? వరదయ్యను సరాసరి ఖైదుకే పంపొచ్చు గదా," అన్నాడు చంగయ్య.

జమీందారు దివానును పిలిచి, వెంటనే వరదయ్యను గురించి దర్యాప్తుచేసి, అసలు

జొన్నలగడ్డ రత్న

సంగతేమిటో వివరంగా తెలుసుకోమని ఆదేశించాడు.

దివాను చంగయ్యను వెంటబెట్టుకుని, దివాణం ఉద్యోగుల క్షేమసమాచారాలు తెలుసుకునేందుకు వచ్చినవాడిలా వరదయ్య ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో వరదయ్య, శేఖరం అనే మరొక దివాణం ఉద్యోగికి డబ్బు యిస్తూండడం దివాను కంటబడింది.

దివాను చిన్నగా నవ్వి, "ఏం, వరదయ్యా, నువ్వు జీతం డబ్బులతో పాటు, అంతో యింతో లంచం డబ్బులు కూడా సంపాయిస్తూ, ఏ ఇబ్బందులూ లేకుండా కాలం గడిపేస్తున్నావని చాలా మంది అనుకుంటున్నారు. అలాంటిది నువ్వే, సాటి ఉద్యోగికి ఏదో లంచం ముట్టజెప్పుతున్నట్టున్నదే!" అన్నాడు.

ఆ మాటలకు శేఖరం గతుక్కు మన్నాడు. వరదయ్య తొణక్కుండా దివానుకు కూర్చుందుకు అరుగుమీదున్న వాలు కుర్చీ చూపించి, "అయ్యా, యీ శేఖరం తోటి ఉద్యోగిగదా, డబ్బు యిబ్బందుల్లో వుండి అడిగితే, చేబదులుగా కొద్దిమొత్తం సర్దుతున్నాను," అన్నాడు.

దివాను ఆశ్చర్యంగా శేఖరం కేసి చూస్తూ, "దివాణంలో మీ యిద్దరి ఉద్యోగాలూ, జీతాలూ కూడా ఒకటే



గదా? అలాంటప్పుడు వరదయ్యకు లేని డబ్బు యిబ్బందులు నీకెలా కలిగినై?" అని, వరదయ్యను, "నువ్వు ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా బతకడంలో వున్న కిటుకేమిటి?" అని అడిగాడు.

"ఇందులో పెద్ద కిటుకేంలేదు. శేఖరం నేనేదో నీతులు బోధిస్తున్నానని అనుకోడనుకుంటాను! నెలాఖరున నేను జీతం తీసుకోగానే, అందులో యింత ఇంటి ఖర్చులకని కేటాయిస్తాను. ఇంట్లో ఎవరికైనా హఠాత్తుగా జబ్బు చేయడం లాంటిది జరక్కపోతే, ఆ కేటాయించిన దాని పైన అదనంగా ఒక్క పైసా కూడా ఖర్చు కాదు. మిగతా డబ్బులో

కొంత పండగలప్పుడు కొత్త బట్టలు కొనేందుకూ, యితరత్రా ఖర్చుకూ వేరే వుంచుతాను. ఈ విధంగా జీతంలో ఎనభై శాతం పోగా, ఆ మిగిలిన ఇరవై శాతం భవిష్యత్తులో ఉద్యోగ విరమణ జరిగాక, ఎవరి మీదా ఆధారపడకుండా బతికేందుకు మిగుల్చుతూంటాను. అందు లోంచే ఎవరైనా చేబదులు అడిగినప్పుడు యిస్తూంటాను,'' అన్నాడు వరదయ్య.

''బావుంది! జీవితాన్ని ఒక క్రమ శిక్షణలో నడపడం అంటే యిదే! నిన్ను చూసి అయినా శేఖరంలాంటివాళ్ళు ఎందుకు నేర్చుకోరు? అది లేకపోగా, నీ పైన లేనిపోని పుకార్లేమిటి?'' అన్నాడు దివాను కోపంగా.

ఆయన తిరిగివచ్చి జమీందారుతో, ''వరదయ్య యిన్నేళ్ళుగా తన రాబడికి అనుగుణంగా ఖర్చులు సరిపెట్టుకుంటూ, ఉన్నంతలో సుఖంగా జీవిస్తున్నాడు. మన తతిమ్మా ఉద్యోగుల బతుకు తీరు యిందుకు పూర్తిగా భిన్నం. తమ ఆర్థిక బాధలకు మూల కారణం తెలియని వాళ్ళందరూ, వరదయ్య మీద పుకార్లు లేవదీశారు,'' అని చెప్పాడు.

జమీందారు కోపంగా, ''ఇదా వరదయ్య చేసిన నేరం! మీరు వెంటనే వరదయ్య మీద అభాండాలు వేసినవాళ్లను తగిన విధంగా శిక్షించండి,'' అన్నాడు.

దివాను చిన్నగా నవ్వి, ''అయ్యా, వరదయ్యలాంటివాళ్ళు చాలా అరుదుగా వుంటారు. అందువల్ల, అలాంటివాళ్ళు తమ సాటివాళ్ళలో ముందు కుతూహలానికీ, ఆ పైన అర్థంలేని శంకలకూ కారకులవుతారు; ఇది సహజం! అందువల్ల మనం వరదయ్యకు మరికొంత ఉన్నత ఉద్యోగం యిస్తే, అతడి మీద పుకార్లు వేసిన వాళ్ళను వేరే శిక్షించనవసరం వుండదు,'' అన్నాడు.

ఆ తరవాత దివాను సలహా ప్రకారం జమీందారు, వరదయ్యను దివాణం నగదు అధికారికి సహాయకుడుగా నియమించాడు.



# చదువొచ్చే మంత్రం!

నారాయణ దీక్షితుడు అనే కుర్రవాణ్ణి, తండ్రి విద్యాభ్యాసం కోసం గురుకులంలో చేర్చాడు. దీక్షితుడు చాలా బద్ధకస్థుడు. తెల్లవారుజామున ఏ అయిదు గంటలకో లేచి పాఠాలు పల్లెవేయాలంటే వాడికి చాలా కష్టంగా వుండేది. అలా పన్నెండేళ్ళు చదివితే గాని విద్య పూర్తికాదు.

ఒకసారి గురుకులానికి స్వామీజీ ఒకాయన వచ్చాడు. ఆయన గొప్ప పండితుడనీ, మంత్ర శాస్త్రంలో అందెవేసిన చెయ్యి అనీ, ఉపాధ్యాయులు అనుకోవడం దీక్షితుడు విన్నాడు.

ఒకనాటి సాయంకాలంవేళ చెట్టునీడన కూర్చుని, ఏదో గ్రంథం చదువుతున్న స్వామీజీ దగ్గిరకు పోయి, దీక్షితుడు, "స్వామీ, సులభంగా చదువు వచ్చేందుకు మంత్రమేమైనా వున్నదా?" అని ఆశగా అడిగాడు.

స్వామీజీ వాడి ముఖం కేసి ఒక క్షణ కాలం చూసి, కళ్ళు మూసుకుని, "లేకేం, నాయనా! సరస్వతీదేవి అనుగ్రహం పొందేందుకు, ఒక మంత్రం వున్నది," అన్నాడు.

"అయితే, ఆ మంత్రం నాకు ఉపదేశించండి," అన్నాడు దీక్షితుడు.

స్వామీజీ చిన్నగా నవ్వి, "దానికేం భాగ్యం, అలాగే ఉపదేశిస్తాను. ఆ మంత్రాన్ని ప్రతి రోజూ తెల్లవారుజామున నాలుగు గంటలకు లేచి, చన్నీటిస్నానం చేసి జపించాలి. అలా పధ్నాలుగేళ్ళు చేస్తే సరస్వతీదేవి కోరిన విద్యలను అనుగ్రహిస్తుంది. వెళ్ళి స్నానం చేసిరా, మంత్రం ఉపదేశిస్తాను," అన్నాడు.

ఆ జవాబుకు దీక్షితుడు బెదిరిపోయి, స్వామీజీ పాదాలు తాకి, "మంత్రం వొద్దు, స్వామీ! మామూలు పద్ధతిలోనే విద్య నేర్చుకుంటాను," అన్నాడు.

— గుంటక సాంబిరెడ్డి





# క్షామపరిస్థితులు

మహేంద్రగిరి రాజైన విశాలాక్షుడు అను మానాల పుట్ట; ఎవరినీ ఒక పట్టాన నమ్మే వాడు కాదు. మండలాధికారు లెవరైనా పరిపాలనావసరాలకు ధనం కావాలని విన్నపం పంపితే, అందులో వాళ్ళ స్వార్థం ఏదో వున్నదనుకునేవాడు.

ఒకసారి రాజ్యంలోని ఉజ్వల మండల ప్రాంతంలో, వరసగా రెండు సంవత్సరాల పాటు వర్షాలు లేక కరువు పరిస్థితులు ఏర్పడినై. ఉజ్వల మండలాధికారి గరుడవర్మ, రాజుకు ఒక నివేదిక పంపి, అందులో మండలంలోని క్షామపరిస్థితులను వివరించి సహాయంగా ఐదులక్షల వరహాలు కావాలని కోరాడు.

విశాలాక్షుడు నివేదికను చదివి, మంత్రి చంద్రవర్మతో, "ఇందులో గరుడవర్మ వాటా ఎంత వుంటుందని మీ ఊహ?" అన్నాడు వ్యంగ్యంగా.

రాజు మాటలకు చంద్రవర్మ మనసులో చాలా బాధపడ్డాడు. ఉజ్వల ప్రాంతం లోని భయంకరమైన కరువును గురించి ఆయన లోగడే విని వున్నాడు. అక్కడ వుంటున్న ఆయన బంధువులు కొందరు క్షామానికి గురై, సహాయం కోసం ఆయనను అర్థించారు.

చంద్రవర్మ తనకు తెలిసిన విషయం రాజుకు చెప్పాలనుకున్నాడు. కాని, ఆయన గరుడవర్మను అన్నట్టుగానే తననూ ఏదో వ్యంగ్యంగా అనగలడన్న సంశయంతో, "మహారాజా, గరుడవర్మ నివేదికలోని వివరాలను గురించి నాకు తెలియదు. కాని, అతడి మండలంలో కరువు కాటకాలు ఏర్పడినట్టు రాజధానిలో చెప్పుకోవడం విన్నాను," అన్నాడు.

"అలా అయితే, మీరు వెంటనే అక్కడికి వెళ్ళి, పరిస్థితులెలా వున్నవో

రాంబాబు

చూసి, సంగ్రహంగా ఒక నివేదిక తయారు చెయ్యండి,'' అన్నాడు రాజు విశాలాక్షుడు.

చంద్రవర్మ మర్నాడు ఉజ్వల మండలానికి ప్రయాణమై వెళ్ళాడు. ఆయన మండలాధికారి గరుడవర్మతో కలిసి క్షామ ప్రాంతాలు చూస్తూంటే కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. బీడు పడిపోయిన చేలల్లో బక్కచిక్కి చచ్చిపోయిన పశువులను రాబందులూ, కుక్కలూ పీక్కు తింటున్నవి. ప్రజలలో ఎక్కువమంది తిండిలేక అతి దీనావస్థలో వున్నారు.

చంద్రవర్మ ఎంత సహాయం అవసరం అవుతుందో ఆలోచించి గరుడవర్మతో, ''రాజుగారి నుంచి నువ్వు కోరిన ఐదు లక్షల సహాయం సరిపోదు. కనీసం పది లక్షల వరహాలు ఖర్చు చేస్తే తప్ప, ఈ క్షామాన్ని అదుపులో పెట్టలేం,'' అన్నాడు.

ఆయన తన అంచనా ప్రకారం పది లక్షల సాయం అవసరమంటూ ఒక నివేదిక తయారుచేసి, దానిని రాజు విశాలాక్షుడికి యిచ్చాడు.

రాజు, ఆ నివేదికలోని ప్రజల కాటక స్థితుల వర్ణన చూసి ఏమాత్రం చలించక పోగా, ''ఆ మండలాధికారి ఎంతో అనుభవం గల మంత్రులైన మిమ్మల్ని కూడా తన పక్షం చేసుకున్నట్టున్నది!'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.



మంత్రి వచ్చే కోపాన్ని ఆపుకుంటూ, ''మహారాజా, అక్కడ క్షామపరిస్థితులు ఎంత దారుణంగా వున్నవో నేను స్వయంగా చూసినవాణ్ణి. మండలాధికారి కోరిన ఐదు లక్షల వరహాలూ ఎందునా సరిపోవు. తమరే ఆ ప్రాంతాలను ఒకసారి ఎందుకు దర్శించకూడదు?'' అన్నాడు.

రాజు, ఒకటి, రెండు క్షణాలు మౌనంగా వూరుకుని, ''సరే, అలాగే చేస్తాను. మీరూ, నా వెంట వుండాలి,'' అన్నాడు.

ఆ మర్నాడు విశాలాక్షుడూ, మంత్రీ ఉజ్వల మండలానికి బయలుదేరారు. రాజధానీ నగరం వదిలి కొద్ది దూరం

ప్రయాణించాక, ఒకచోట రాజుకు ఏపుగా వున్న పంట పొలాల పక్కన కొన్ని జంతువుల శవాలు కనిపించినై.

రాజు వాటిని మంత్రికి చూపుతూ, "మన నగరవాసులు పారిశుధ్యం విషయంలో చాలా అజ్ఞానస్థితిలో వున్నట్టున్నది. చచ్చిన జంతువుల శవాలను అలా ఆరుబయట పారవెయ్యడమేమిటి? ఖననం చేస్తే సరిపోతుంది గదా," అన్నాడు.

"మహారాజా, సాధారణంగా ఎవరూ చచ్చిన జంతువులను ఖననం చెయ్యరు, యిలా ఊరి బయట పారేస్తారు. వాటిని ఏ రాబందులో, కుక్కలో పీక్కుతింటవి," అన్నాడు మంత్రి.

"అవును, ఆ మాట నిజమే! మరి, ఈ ప్రాంతాన ఎక్కడా ఒక్క రాబందుగాని, కుక్కగాని కనబడదేం? ఆశ్చర్యం!" అన్నాడు రాజు.

"ఇందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. మన రాజధానీ నగరంలోని కుక్కలూ, చుట్టుపక్కల వున్న కొండల్లో నివసించే రాబందులూ, ఉజ్వల మండలానికి వెళ్ళివుంటాయి," అన్నాడు మంత్రి.

ఆ జవాబుతో రాజు విశాలాక్షుడికి వాస్తవ పరిస్థితులేమిటో అర్థమయినై. ఆయన వణుకుతున్న కంఠ స్వరంతో, రథసారథిని వెంటనే రథాన్ని వెనక్కు మళ్ళించమని ఆజ్ఞాపించాడు.

"అదేమిటి, మహారాజా! మనం ఉజ్వల మండలానికి ప్రయాణమయి పోతున్నాంగదా?" అన్నాడు మంత్రి.

"అవసరంలేదు. అక్కడి క్షామ పరిస్థితులెలావున్నవో, యిక్కడే నేను అంచనా వేశాను," అన్నాడు రాజు.

ఆయన రాజభవనానికి తిరిగి వస్తూనే ఉజ్వలమండలానికి తక్షణ సాయంగా ఇరవై లక్షల వరహాలు మంజూరు చేశాడు. దానితోపాటు యితర సహాయ కార్యాలు కూడా ప్రకటించి, వాటిని పర్యవేక్షించేందుకు మంత్రిని స్వయంగా అక్కడికి వెళ్ళవలసిందిగా కోరాడు.



# ఇంటిమర్యాద

సుశాంతుడికి తను మంచి పాటగాడిననీ అనుమానం. అతడు ఒకరోజున దారిన పోతున్న దానయ్యను ఆపి, ఒక పాట పాడి వినిపించి, "పాట ఎలా వున్నదయ్యా?" అని అడిగాడు.

"తమరి ముక్కు చాలా బాగున్నదండి!" అన్నాడు దానయ్య.

"పాట గురించి అడిగితే, ముక్కు గురించి చెబుతావేమిటయ్యా?" అన్నాడు సుశాంతుడు ఆశ్చర్యంగా.

"అది, మా ఇంటి మర్యాదండి," అన్నాడు దానయ్య.

"ఇదేం మర్యాద! పాట ఎలా వున్నదని అడిగితే, ముక్కు బావున్నదని చెప్పడంలో మర్యాద వున్నదా?" అని అడిగాడు సుశాంతుడు రవంత కోపంగా.

"ఎదుటి వాళ్ళు దేన్ని గురించయినా అభిప్రాయం అడిగారనుకోండి. అది మనకు నచ్చక పోతే, ఆ మాట చెప్పడానికి బదులు, వారిలో మనకు నచ్చిన అంశం చెప్పిపోవడం మర్యాద అని మా తాత, మా నాన్నకూ; మా నాన్న నాకూ చెప్పారు," అని వెళ్ళిపోయాడు దానయ్య.

— "బాబి"






వింధ్య ప్రాంతంలో ఒక కాపు ఉండే వాడు. అతడికి గంగ అని ఒక కూతు రుండేది. ఆమె పసితనం నుంచి కూడా గొర్రెలనూ, మేకలనూ కాస్తూ, అవి మేత కోసం తిరిగే స్థలాలన్నీ తిరుగుతూ ఉండేది.

ఒకనాడు గంగకు ఒక విచిత్రమైన మొక్క కనిపించింది. అది పశువులు తిరుగుతూ మేత మేసే చోట ఉన్నది. అక్కడ ఉంటే దానికి క్షేమం లేదని, గంగ దాన్ని అక్కడి నుంచి తీసి, కొంచెం ఎత్తుగా, రాళ్ళమయంగా ఉండే చోట నాటింది. ఆమె దానికి ప్రతి రోజూ, కొద్ది దూరాన ఉన్న చెరువు నుంచి నీరు తెచ్చి పోస్తూ వచ్చింది.

గంగ పోషణలో ఆ మొక్క ఏపుగా ఎదిగి వచ్చి, కొద్ది కాలంలోనే మహావృక్ష మయింది. దాని కింద నీడ చల్లగా ఉండేది. దాని కొమ్మలలో ఎన్నో పక్షులు నివాసాలు ఏర్పరచుకున్నాయి. గంగ తన గొర్రెలనూ, మేకలనూ ఆ ప్రాంతానికే తోలుకు వచ్చి, ఎండవేళ ఆ చెట్టు కిందనే విశ్రాంతి తీసుకునేది. ఎండ మరీ జాస్తిగా ఉన్నప్పుడు ఆ చుట్టు పక్కల మేసే పశువులన్నీ కూడా వచ్చి ఆ చెట్టు నీడనే పడుకునేవి.

గంగ నాటిన చెట్టుకు కొద్ది దూరంలో ఉండే చెరువు ఆ చుట్టుపక్కల వుండే అనేక గ్రామాలకు జలాధారం. వేసవిలో కూడా అందులో అంతో ఇంతో నీరుండేది. వేసవి రాగానే అక్కడి వాళ్ళు ఆ చెరువులో ప్రతులు తవ్వి, నీటిని ప్రాణంతో సమంగా కాపాడుకుంటూ ఉండేవారు. ఎందుకంటే, ఆ చెరువు ఎండిపోతే వారికి మరొక జలాధారమేమీ అనేక కోసుల దూరంలో కూడా లేదు.

ఇలా ఉండగా ఒక ఏడు వర్షాలు బాగా పడలేదు. అందుచేత ఆ చెరువు ప్రతి ఏడూ నిండినట్టుగా నిండలేదు. తరవాత వేసవి చాలా తీవ్రంగా వచ్చింది. చెరువు కాస్తా ఎండిపోయింది. చెట్లూ, చేమలూ మాడిపోసాగాయి. గరిక కూడా ఎండి పోయి పశువులకు మేత దొరకని స్థితి ఏర్పడింది. జనం నీటికోసం అల్లాడ సాగారు. కొందరు దూర ప్రాంతాలకు వెళ్ళిపోయారు.



ఒకనాటి మధ్యాహ్నం వేళ గంగ తాను నాటిన చెట్టు వద్దకు వచ్చింది. తాను కష్టపడి పెంచిన ఆ చెట్టు మాడిపోతుం దేమోనని ఆమెకు బెంగ. కాని ఆ చెట్టు మాత్రం చెక్కు చెదరలేదు. దాని ఆకులు దట్టంగా నవనవలాడుతూ ఉన్నాయి. చెట్టునీడ చల్లగా, ప్రాణం లేచి వచ్చేలా గున్నది. దాహంతో తపించిపోతున్న గంగ దాని నీడన పడుకుని, తాను చావటం తథ్యం అనుకున్నది. ఆమె ఆ రోజు నీటిచుక్క ఏమిటో ఎరగదు. దాహంతో నాలుక ఈడ్చుకు పోతున్నది. తన చెట్టు నీడనే ప్రాణాలు విడుద్దామన్న కోరికతో ఆమె కాళ్ళీడ్చుకుంటూ అక్కడికి వచ్చింది. అంతదూరంలో చెరువు పాడి ఆరిపోయి బావురుమంటున్నది. గంగ మెల్లగా కళ్ళు మూసింది.

అంతలోనే గంగకు ఒక భ్రమలాటిది కలిగింది. చెట్టు మానులో ఒక మనిషి ముఖంలాటిది పొడగట్టి, "గంగా, నాకు చాలాకాలం నీరుపోశావు. నీకు నీరిస్తాను. నా వేరు ఒకటి పెకలించావంటే నీకు నీరు దొరుకుతుంది. ఆ నీరు తాగి వేరు మళ్ళీ యథాస్థానంలో పెట్టెయ్యి. ఈ రహస్యం ఎవ్వరికీ చెప్పకు!" అన్నది.

గంగ తన కళ్ళనూ, చెవులనూ నమ్మ లేకపోయింది. ఆమె లేచి అటూ ఇటూ చూసేసరికి ఒక రాతిమీదుగా భూమిలోకి దిగబడిన వేరొకటి కనిపించింది. ఆమె తన శక్తినంతా వినియోగించి దానిని పైకి లాగింది. వెంటనే వేరు దిగబడిన రంధ్రం

నుంచి నీటిధార పైకి చిమ్మింది. గంగ దాన్ని కడుపారా తాగి, వేరు మళ్ళీ యథాస్థానంలో పెట్టేసింది.

అంతలోనే అక్కడికి ఒక ముసలి వాడు వచ్చి, దాహమంటూ శోషతో పడి పోయాడు. వాడికి నీరివ్వటానికని గంగ వేరును మళ్ళీ పైకి లాగింది. ఆ సమ యంలో, "గంగా, వేరుతీస్తే నీ ప్రాణాలు పోతాయి!" అని వెనకటి కంఠమే బెదిరించింది.

ఈ బెదిరింపుకు భయపడక గంగ వేరు పైకిలాగి, పైకి చిమ్మిన నీటిధార వద్దకు వృద్ధుణ్ణి చేర్చింది. ముసలివాడు ఆ నీరు చూసి పరమానందం చెందాడు. ఆ నీరు తాగగానే అతనికి ప్రాణం లేచి వచ్చింది.

గంగ ఆ వేరును తిరిగి యథాస్థానంలో పెట్టకుండా ముసలివాడితో, "తాతా, ఇక్కడ నీరున్నదని చుట్టుపక్కల అంద రికీ తెలియజెయ్యి. నేను వెళ్ళటానికి వీలు లేదు!" అన్నది. ముసలివాడు బయలు దేరి వెళ్ళిపోయాడు.

గంగ ఆ నీటిధారకేసే చూస్తూ నిలబడి పోయింది. ఆ నీరు ఆగకుండా అలాగే పైకి వచ్చి తిరిగి కిందపడి చెరువు కేసి పోసాగింది. ఆమె చెట్టుకేసి తిరిగి, "నీ మాట వినకుండా ప్రజలప్రాణాలు కాపాడ డానికి ఈ పని చేశాను. అందరూ బతికే పక్షంలో నేను ఒక్కతెను పోయినా ఫరవా లేదు. నా ప్రాణం బలితీసుకో!" అన్నది.

చెట్టు మానులో వెనకటి ముఖమే ప్రత్యక్షమయింది. "నిన్ను పరీక్ష చెయ్యా టానికలా అన్నాను గాని నీ ప్రాణం ఎందుకు తీస్తాను, గంగా? నీవు నాకు ఒకప్పుడు జలదానం చేశావు గనక అందుకు ప్రతిఫలంగా ఈ చెరువు నించు తాను. ఇక ఎన్నడూ ఈ ప్రాంతాన నీటి ఎద్దడి లేకుండా చేస్తాను," అని చెప్పి ఆ ముఖం కాస్తా మాయమయింది.

ఆ ప్రకారమే చెట్టుకింద జలతో చెరువు చాలా వరకు నిండింది. దానితో ఆ ప్రాంతాల ఉండే మనుషుల ప్రాణాలూ దక్కాయి.





# విష్ణు కథ

సత్యవ్రతుని మాటలు విని చేప సముద్ర మధ్యానికి చేరి, మహాపర్వతంలాగ సాగరం పొడవునా పెరిగి, "సత్యవ్రతా! నీ వాక్కు అమోఘంగా పని చేసింది, చూశావా! ఇంకా పనిచేస్తూనే ఉంది. ఇలా ఇంకా, ఇంకా పెరిగిపెరిగి ఏమైపోతానో!" అన్నది.

అప్పుడు సత్యవ్రతుడు చేతులెత్తి మ్రొక్కుతూ, "మత్స్యరూపంలో ఉన్న ఓ నారాయణుడా! రక్షణ కోరుతున్నట్టే వచ్చి, నన్ను రక్షించడానికే మత్స్యావతారం ఎత్తావు. నీ లీలలు తెలుసుకోవడానికి నేనే మాత్రం!" అంటూ ఎన్నో విధాల స్తుతించాడు.

అప్పుడు మత్స్యావతారంలో ఉన్న విష్ణువు, "ఓ రాజా! ఏడు దినాలకు కల్పాంతం కాబోతున్నది. ప్రళయ జలాల్లో అంతా మునిగిపోతుంది. జ్ఞానం, ఓషధులు, విత్తులు నశించకూడదు. ముందొచ్చే కల్పానికి అవి లేకపోతే ఎలాగ? అందుచేత అవి రక్షింపబడాలి. నీ కోసం పెద్ద నౌక గాఢాంధకారంలో దీపంలాగ వెలుగుతూ వస్తుంది. అందులో సప్తర్షులు ఉంటారు, ఆ వెలుగు వారిదే!

ఓషధుల్నీ, విత్తనాల రాసుల్నీ, నీతో బాటు నౌకలోకి చేర్చు! నా మీద ఉండే కొమ్ము చివరతో, మీరుండే నావను పట్టి ఉంచి మునిగిపోకుండా అన్ని విధాలా నేను రక్షించుతూ, ఉంటాను. అందుకే నేను యిలాగ అవతరించాను. బ్రహ్మ మేల్కాంచేవరకూ నావ ధ్రువుణ్ణి దిక్సూ

2. మత్స్యావతారం



చిగా పెట్టుకొని పయనిస్తూంటుంది. రాబోయే కల్పంలో నువ్వు వైవస్వతుడు అనే పేరున మనువుగా ఉంటావు!'' అని ఆదేశించాడు.

సత్యవ్రతుడు విష్ణువు ఆనతిని తల దాల్చి వినమ్రుడై మ్రొక్కాడు.

మత్స్యావతారం నాలుగు రెక్కలు ఊపుతూ, తోకతో త్రుళ్ళగొడుతూ, ఉవ్వెత్తున లేస్తున్న కెరటాలను చీల్చుకొని, సముద్రంలోకి వెళ్ళింది.

బ్రహ్మ మంచి నిద్ర తీస్తున్నాడు. అంధకారంలో విలయకాండ జరుగుతూన్నది.

హయగ్రీవుడు అనబడే సోమకాసురుడు తలాతలం నుండి సముద్రం మీదకు వచ్చి గబ్బిలంలాగ బ్రహ్మ ఉండే సత్యలోకానికి ఎగిరాడు.

నిద్ర వచ్చి బ్రహ్మ ఆవులిస్తున్నప్పుడు, అతని నాలుగు ముఖాల నుండి తెలుపు, ఎరుపు, పసుపు, నీలం రంగుల్లో ప్రకాశిస్తున్న నాలుగు వేదాలు వెలుపలికి వచ్చి పక్కనే పడి ఉన్నాయి. హయగ్రీవుడు వాటిని తస్కరించుకొనిపోయి, సముద్రం అట్టడుగు శిలల పొదల్లో దాచాడు.

హయగ్రీవాసురుడు దేవతలకు, విష్ణువుకు ప్రబల విరోధి. వేదాలు లేకుండా బ్రహ్మ సృష్టి చేయలేడు. కల్పకల్పానికీ మంచినీ, ప్రగతినీ పెంపొందించాలనే విష్ణువు సంకల్పం చెడగొట్టడమే వాడి ఉద్దేశం.

ప్రళయ సముద్రం భూమిని ముంచుతున్న సమయంలో, ఎదురు చూస్తూన్న సత్యవ్రతుడికి అంధకారంలో దూరంగా చిన్న వెలుగు, చుక్కలా కనిపించి పెద్దదౌతూ సమీపిస్తున్నది; అదే సప్తర్షుల కాంతితో నిండిన నావ!

ఓషధులనూ, నానావిధ బీజ సంపదనూ నౌకలోకి చేర్చి సత్యవ్రతుడు నారాయణ సంకీర్తనం చేస్తూ నావలో ప్రయాణిస్తున్నాడు. మత్స్యావతారం ముక్కుపై నిలువుగా పెద్ద కొమ్ము ఉంది. నక్షత్రంలాగ మెరుస్తున్న ఆ కొమ్ము

చివరను చుట్టుకొని ఒక మహాసర్పం పెద్ద త్రాటితో కట్టినట్లు ఓడను కలిపి పట్టుకొని, పడగవిప్పి ప్రళయ ప్రభంజనాలను పీల్చి దిగమ్రింగుతూన్నది. మత్స్యావతారం తన రెక్కలతో కెరటాలను తూలగొడుతూ సముద్రాన్ని చీల్చుకొని, నావను భద్రంగా తీసుకెళుతూన్నది. ధ్రువతార గుర్తుగా నౌక పువ్వులాగ తేలుతూ పయనిస్తూన్నది.



సముద్రం అడుగున దాచిన వేదాలను కాపలా కాస్తూ సోమకాసురుడు సముద్రం లోపల తిరుగుతున్నాడు. నాలుగు వేదాలు నలుగురు శిశువులుగా మారి క్యారుమంటూన్న ఆర్తనాదం లీలగా వినవస్తున్నది.

మత్స్యావతారం వేదాలను వెతుకుతూ వెళ్ళింది.

మహామత్స్యాన్ని చూసి సోమకాసురుడు భీతిల్లుతూనే మొండి ధైర్యంతో ముళ్ళ గద నెత్తి ఎదుర్కొన్నాడు.

అప్పుడు విష్ణువు నడుము వరకు మత్స్యంగా చతుర్బాహువులతో అవతరించాడు. మత్స్యమూర్తికీ, సోమకాసురుడికీ ఘోరసంగ్రామం జరిగింది.

సోమకాసురుడు సముద్రం అట్టడుగు చేరి పారిపోతూంటే విష్ణువు చక్రంతో వాణ్ణి ముక్కలు ముక్కలుగా నరికి హతమార్చాడు.

విష్ణువు పసిబిడ్డల రూపంలో ఉన్న వేదాలను ఎత్తుకొని, ఇద్దరేసి పిల్లల్ని చెరో సందిట చేర్చుకొని నీటి మీదికి వచ్చాడు. పిల్లలు విష్ణువు కంఠహారంలోని శ్రీవత్స, కౌస్తుభ మణులను చిట్టి చేతులతో ఆడుకుంటూ కిలకిలా నవ్వుతూ కేరింతాలు కొడుతున్నారు. నలుగురు పిల్లలూ తెలుపు, ఎరుపు, పసుపు, నీలం కాంతితో మెరుస్తున్నారు. విష్ణువు మీది చేతుల్లో శంఖచక్రాలు ప్రకాశిస్తున్నవి.

విష్ణువు మత్స్యావతార మూర్తిని చూసి ఋషులు, సత్యవ్రతుడు మహదానందంతో మైమరిచి చేతులెత్తి మ్రొక్కుతూ స్తోత్రం చేశారు. ప్రళయ సముద్రం



బ్రహ్మ విష్ణువు మత్స్యావతార రూపాన్ని కన్నుల పండుగగా తిలకించి చేతులు జోడించి నాలుగు నోళ్ళతో కీర్తించాడు.

"ఓ నారాయణా! నీ మత్స్యావతారాన్ని ధ్యానించిన వారికి ప్రళయంలాగ విరుచుకు వచ్చిన ఆపదలన్నీ తొలగిపోతవి. అజ్ఞానాంధకారం పటాపంచలౌతుంది!" అని బ్రహ్మ అన్నాడు.

మత్స్యావతారం ఎత్తిన కార్యం పూర్తిగా నెరవేరింది. విష్ణువు అంతర్థానమై, తన నివాసమైన వైకుంఠాన్ని చేరాడు.

బ్రహ్మ వేదాలు తీసుకొని సృష్టి మొదలుపెట్టాడు. కొత్త కల్పానికి వివస్వంతుడనే పేరున ఉదయించిన సూర్యుడికి పుత్రుడుగా సత్యవ్రతుడు శ్రార్ధదేవుడు–వైవస్వతుడు అనే పేరున మనువైనాడు.

శాంతించి భూభాగం ఏర్పడుతూన్నది; నౌక గమ్యం చేరుకొంది.

బ్రహ్మకు పగటి ప్రమాణం ఎంతో రాత్రీ అంతే. అతని నిద్రాకాలం పూర్తి కావస్తున్నది. సరికొత్త కల్పం ఆరంభమౌతూన్నది.

సరస్వతీదేవి ముందుగా లేచి వీణ సవరించి భూపాలరాగాన్ని పలికిస్తూన్నది. బ్రహ్మ మేలుకొని నాలుగు తలల్లో ఏదో కలత, వెలితి అనిపించి పరికించి చూస్తే వేదాలు లేవు! వేదాలు పోగొట్టుకొని దిగులుగా ముఖాలు వేలాడదీసుకుని విచారిస్తుండగా, విష్ణువు మత్స్యావతారంతో వేదాలను తెచ్చి అతనికి యిచ్చాడు.

సప్తఋషులు ఆకాశానికి చేరుకొని తమ తమ స్థానాల్లో సప్తర్షిమండలంగా ప్రకాశిస్తూ ధ్రువునికి ప్రదక్షిణం చేస్తూ, తిరగసాగారు—అని సూతుడు చెప్పగా మునులు, "సూత మునీంద్రా! ధ్రువుని చరిత్ర వినగోరుతున్నాము!" అన్నారు.

సూతుడు చెప్పసాగాడు :

ఈ మహా విశ్వంలో ఉన్నతోన్నతమైన స్థానమే ధ్రువమండలం. అదే విశ్వస్వరూపుడైన విష్ణువు శిరస్సుండే తావు.



అంతటి అత్యున్నత పదాన్ని పొందిన ధ్రువుడు ఉత్తానపాదుడు అనే రాజు కొడుకు. ధ్రువుడి తల్లి సునీతి ఉత్తానపాదుటి పెద్ద భార్య, సురుచి చిన్న భార్య. రాజుకు చిన్న భార్య సురుచి మీద మక్కువ ఎక్కువ.

ఒకనాడు ఉత్తానపాదుడు సురుచి కొడుకు ఉత్తముణ్ణి తన తొడపై కూర్చొబెట్టుకొని ముద్దుచేస్తుండగా, ధ్రువుడు అక్కడకు వచ్చి, తాను కూడా తండ్రి తొడపై కూర్చోవాలని తండ్రి దగ్గిరగా చేరి ఆశతో చూశాడు. సురుచి అక్కడే ఉన్నది. రాజు ఆమెకు జడిసి ధ్రువుణ్ణి చూసీచూడనట్టు ఊరుకున్నాడు. తమ్ముణ్ణి కూర్చోబెట్టుకొన్నట్లే తండ్రి తన్ను కూడా ఎత్తి కూర్చోబెట్టుకుంటాడని ఆశించిన ధ్రువుడు బిక్కమొహం వేసి గుడ్ల నీరు పెట్టుకొన్నాడు. పసివాడి బుగ్గలపై కన్నీటి ముత్యాలు మెరిశాయి.

అది చూసి సురుచి ఫక్కున నవ్వి, "దిక్కుమాలిన దానికి పుట్టినవాడా! నువ్వు ఎంత తపస్సుచేసినా, నా కొడుకుతో సమానంగా తండ్రి తొడ మీద కూచునే యోగం నీకు అబ్బదురా, అబ్బీ! నా కడుపున పుట్టాలి; నీకా భాగ్యం కలగాలి! అంతే! అన్నట్టు నువ్వు మహా గొప్పగా నారాయణ సంకీర్తనం చేస్తూంటావేమో, తపస్సు చేసి, ఆ భాగ్యం కల్గిస్తాడేమో ఆ నారాయణుడినే అడిగి చూడు," అని హేళన చేసింది.

పసివాడి మనస్సు కుతకుతలాడింది; దుఃఖం పెల్లుబికింది, ఉక్రోషం ముంచుకొచ్చింది. కొరడా తీసుకొని సురుచిని చావబాదాలనిపించింది. కత్తితో నిలువునా చీరెయ్యాలనిపించింది. మరుక్షణంలోనే సురుచి, "నాయనా! నారాయణుడిని నమ్ముకో! తపస్సు చెయ్యి." అని ఉపదేశించిన సద్గురువులాగ కనిపించింది. అంతటి మహత్తరమైన ఉపదేశానికి నోచుకొని ఉత్తముడు అభాగ్యుడైన వట్టి అమాయకుడిలాగ కనిపించాడు. ఉత్తాన



పాద మహారాజు చీకటివలలో చిక్కుకొని బిక్కుబిక్కుమంటున్న దుప్పిలాగ కనిపించాడు.

ధ్రువుడు సురుచికి గురూపదేశం పొందిన శిష్యుడిలాగ నమస్కరించి, అక్కడినించి వెళ్ళాడు. ధ్రువుడి చేష్ట అర్థం కాని సురుచి మొదట నివ్వెర పోయింది. తరవాత "కుర్రాడు మంచివాడే! నాలుగు తిట్టినా మ్రొక్కుతూ వెళ్ళాడు. ఐనా మ్రొక్కకేం చేస్తాడు. నా ఎదట నోరు మెదపడం వాడి తరమా? వాడి తల్లి తరమా?!" అని సగర్వంగా తనలో తాను విపరీతంగా పొంగిపోతూ సరిపెట్టుకుంది.

కన్నీటి చారలతో వచ్చిన ధ్రువుణ్ణి చూసి జరిగింది దాసీలవల్ల విన్న సునీతి బావురుమంటూ, "ఔను, నాయనా! దాసీ దానికన్న హీనంగా బతుకుతున్న నా కడుపున ఎందుకు నువ్వు పుట్టాలి? నలుగురెదుట అవమానపడాలి? నీ సవతి తల్లి మాటలు ముమ్మాటికీ నిజం. నీకూ నాకూ ఆ నారాయణమూర్తి తప్ప వేరే దిక్కు లేదు!" అన్నది.

ఆ మాటలకు ధ్రువుడు ధైర్యంగా లేచి నిలబడి, "అమ్మా! నేను తపస్సుకి వెళ్తున్నాను!" అన్నాడు.

"ఏమిటీ! తపస్సు చేస్తావా? సురుచి కడుపున పుట్టాలని వరంకోరుకో!" అన్నది సునీతి.

"అమ్మా, ఆగు! మళ్ళీ ఆ మాటే అనకు; నేను నీ కొడుకును. మరెవరికో కొడుకునై పుట్టాలని ఎందుకు కోరతాను? మనల్ని మనం తక్కువ చేసుకోకూడదు. అది ఆత్మహత్యతో సమానం. ధ్రువుడి తల్లి ఎంత భాగ్యశాలి అనేలాగ, దిక్కులకు దిక్కుగా ఉండేలాగ నారాయణుణ్ణి కోరుకుంటాను, వస్తాను!" అని చెప్పి ధ్రువుడు బయలుదేరాడు.

నారదుడు ఎదురుగా వస్తూ, "ఓహో, ధ్రువకుమారా! ఆడుకోడానికి బయలుదేరినట్టుంది, ఔనా?" అన్నాడు.

"తపస్సుకు వెళ్తున్నాను, స్వామీ!" అన్నాడు ధ్రువుడు.

"తపస్సు అనే ఆట ఒకటి ఉందన్న మాట. చక్కా ఆడుకో నాయనా!" అన్నాడు నారదుడు.

"ఆటకాదు, నిజంగా తపస్సు చేయడానికే వెళ్తున్నాను, మునీంద్రా!" అన్నాడు ధ్రువుడు.

"అదా సంగతి. ఓస్! ఈ మాత్రం దానికి తపస్సెందుకోయి ధ్రువా! నాతో రా. నీ తండ్రి నిన్ను తొడ మీద ఎందుక్కూర్చోబెట్టుకోడో చూస్తాను!" అన్నాడు నారదుడు.

"ఎవరి దయాధర్మాలూ నాకు వద్దు, స్వామీ! అన్నిటికంటె ఉన్నతమైన నారాయణుని అనుగ్రహం నాకు కావాలి! అందుకే తపస్సు చేయడానికి అరణ్యానికి వెళ్తున్నాను!" అన్నాడు ధ్రువుడు.

"తపస్సంటే మాటలు కాదు, నాయనా! అరణ్యంలో పులులు, సింహాలు మొదలైన క్రూర మృగాలుంటాయి. ఎండా వానా చలీ అన్నీ బాధగానే ఉంటాయి. నా మాట విను, ఇంటికి పద!" అన్నాడు నారదుడు.

నారదుడి మాటలకు ధ్రువుడు, "నేను క్షత్రియుణ్ణి. పరాభవం సహిస్తూ బతకలేను. నాకు పిరికిమందు నూరిపోయడానికి వచ్చారా, స్వామీ?" అన్నాడు వినయంగా.

"నాయనా, ధ్రువా! నీ దీక్ష తెలుసుకోడానికే అలాగ అన్నాను. ఒకప్పుడు నేను కూడా దిక్కులేని బాలుడనై ఎన్నెన్నో అవమానాలూ, అగచాట్లూ పడి అడవి చేరి తపస్సు చేసినవాడినే! నువ్వు మధువనానికి వెళ్ళి, 'ఓం నమోనారాయణ' అని జపిస్తూ తపస్సుచెయ్యి. నిన్ను ఆశీర్వదిస్తున్నాను, కృతార్థుడివైరా!" అని నారదుడు అన్నాడు—అని సూతుడు చెప్పగా మునులు, "మునీంద్రా! నారదుడు ఎందుకు అగచాట్లు పడ్డాడు? నారదుడి వృత్తాంతం వినాలని కుతూహలంగా ఉంది!" అన్నారు.






ఒకసారి ఒక పేదవాడూ, వాడి భార్యా పొట్ట చేతపట్టుకుని బాగ్దాదు నగరానికి వచ్చారు. వాళ్ళు రోజూ పని కోసం వీధుల వెంట తిరుగుతూ ఉండటం చూసి ఒక పెద్దమనిషి పేదవాడితో, "ఎందుకు రోజూ మీరు వీధుల వెంబడి తిరుగుతున్నారు?" అన్నాడు.

"అయ్యా, కూలి కోసం తిరుగుతున్నాను," అన్నాడు పేదవాడు.

"ఏదైనా వృత్తి చేసుకోరాదా?" అన్నాడు పెద్దమనిషి.

"ఏం చెయ్యను? నాకే వృత్తీ రాదు," అన్నాడు పేదవాడు.

"అలా అయితే ఒక గొడ్డలి తీసుకుని సుంకాల కచేరీ దగ్గిరికి పోతే కట్టెలు పేళ్ళు వేసుకుని నాలుగు డబ్బులు సంపాదించుకో వచ్చునే!" అన్నాడు పెద్ద మనిషి.

పేదవాడు మర్నాడు గొడ్డలి తీసుకుని, సుంకాల కచేరీ ప్రాంతాలకు వెళ్ళాడు. అక్కడ కట్టెలను పేళ్ళుగా నరికి అందువల్ల వచ్చిన కొద్ది డబ్బులతో తన పొట్టా, తన భార్య పొట్టా పోషించుకుంటూ కాలం గడపసాగాడు.

ఒకనాడు పేదవాడి భార్య, "ఇదుగో, నేను హమామ్‌కు వెళ్ళి స్నానం చేసి రావాలి, డబ్బులుంటే ఇయ్యి," అన్నది భర్తతో.

పేదవాడు డబ్బులు తీసి ఇచ్చాడు. భార్య స్నానశాలకు వెళ్ళింది. అక్కడ గొప్పగొప్ప వాళ్ళంతా వచ్చి స్నానాలు చేస్తున్నారు. తన పేదరికం తలుచుకుని, ఆవిడకు చచ్చే సిగ్గయింది.

ఇంతలో నలుగురూ, "ఆస్థానజ్యోతిష్కుడి భార్య!", అనుకోవటం విని పేదవాడి భార్య, అందరిలాగే తల ఎత్తి, మెడ



నిక్కించి చూసింది. ఆ సమయంలో స్నానశాలలోకి ఆస్థానజ్యోతిష్కుడి భార్య ఠీవిగా ప్రవేశించింది.

"ఛీ, నా బతుకు ఏం బతుకు! పెళ్ళామయితే ఆస్థానజ్యోతిష్కుడి పెళ్ళామే కావాలి!" అనుకుంటూ పేదవాడి భార్య స్నానం చేసి ఇంటికి పోయింది. తన భర్త ఇంటికి తిరిగి రాగానే ఆవిడ, "ఇదుగో, నువు వెంటనే ఆస్థానజ్యోతిష్కుడివవుతావా? లేక నన్ను వదిలేసి వెళ్ళిపోతావా? ఏదో ఒకటి తేల్చుకో!" అన్నది.

పేదవాడు నిర్ఘాంతపోయి, "నాకు చదువే రాదే. నేను ఆస్థాన జ్యోతిష్కుడు కావటమెలాగ?" అన్నాడు.

"అదంతా నాకు తెలీదు. ఆస్థానజ్యోతిష్కుడివి అయి గాని నీ మొహం నాకు చూపకు!" అన్నది భార్య.

చేసేదిలేక పేదవాడు కాగితాలూ, కలమూ, సిరాబుడ్డీ పట్టుకుని స్నానశాల వద్దకు వెళ్ళి ద్వారం వద్ద కూచుని, నలుగురికీ కనిపించేలాగా, "యంత్రాల" బొమ్మలు గీయసాగాడు.

కాస్సేపట్లో స్నానశాలకు ఖలీఫాయే స్వయంగా వచ్చాడు. అందరూ ఆయన చుట్టూ మూగి, అవీ ఇవీ యాచిస్తూండటం చూసి పేదవాడు, "ఏలినవారు ఒక్కసారి ఇలా దయచేస్తారా?" అని ద్వారం వద్ద నుంచి అడిగాడు. ఏ బుద్ధిన ఉన్నాడో ఖలీఫా స్నానశాలలోనుంచి ద్వారం వద్దకు వచ్చాడు. ఆ క్షణంలోనే స్నానశాల కప్పు కాస్తా కూలిపడింది.

"కాస్త అయితే, ఖలీఫాగారి ప్రాణం పోయి ఉండేది! ఆ జ్యోతిష్కుడెవడో చాలా గొప్పవాడై ఉండాలి ఖలీఫాగారికి పెద్ద గండం తప్పించాడు!" అని అందరూ పేదవాణ్ణి మెచ్చుకున్నారు. అక్కడ చేరిన వారంతా తమ దగ్గిర ఏది వుంటే అది పేదవాడికి బహూకరించారు. ఖలీఫా మాట వేరే చెప్పనక్కర్లేదు.

ఈ బహుమానాలన్నిటినీ పట్టించుకుని పేదవాడు ఇంటికి వెళ్ళి, "ఓయ్, చుశావా

ఈ బహుమానాలన్నీ ?'' అన్నాడు ఎక్కడ లేని సంతోషంతో.

'' ఎవరికొక్కవాలి ఈ బహుమానాలు? నువు ఆస్థాన జ్యోతిష్కుడివి అయావా, లేదా ? అది ముందు చెప్పు ! '' అన్నది భార్య.

పేదవాడు బిక్క మొహం వేసి, '' ఇంకా లేదు,'' అన్నాడు.

'' అయితే నీ మొహం నాకు చూపించకు ! '' అన్నది భార్య. పేదవాడు వెళ్ళిపోయి స్నానశాల బయట మళ్ళీ తిష్ఠ వేశాడు.

ఒకరోజు ఖలీఫాగారి వజ్రపుటుంగరం పోయింది. ఎంత వెతికినా కనిపించలేదు. చివరకు ఎవరో, '' ఆ హమామ్ ద్వారం వద్ద కూచునే జ్యోతిష్కుడు చాలా గట్టివాడు. ఖలీఫాగారి ప్రాణాలు కాపాడాడు కూడానూ. ఈ దొంగతనం అతని వల్లనే బయటపడాలి ! '' అన్నారు.

ఇంకేముందీ ? ఖలీఫా పేదవాణ్ణి పిలిపించి తన వజ్రపుటుంగరం ఎక్కడవున్నదీ కనిపెట్టమన్నాడు.

'' ఏలినవారు నాకు కొంచెం వ్యవధి ఇవ్వాలి,'' అన్నాడు పేదవాడు, ఏమి చెయ్యటానికీ తోచక.

'' రెండు రోజులు తీసుకో కావలిస్తే,'' అన్నాడు ఖలీఫా. ఈలోపల బాగ్దాదు వదలి పారిపోదామనుకున్నాడు పేదవాడు. కాని ఖలీఫా మనుషులు అతణ్ణి రాజమందిరం లోనే ఒక పెద్ద గదిలో బంధించి, అతనికి





కావలసిన ఆహారం, వగైరాలన్నీ అక్కడికే తెచ్చిపెట్టారు.

పేదవాడికి మతిపోయినట్టయింది. అతను రోజల్లా కిటికీ దగ్గిర నిలబడి, బయట వున్న మైదానం కేసి చూస్తూ ఉండిపోయాడు. ఆ మైదానం మీద కొన్ని పెద్ద బాతులు కనిపించాయి. వాటిలో ఒక బాతు కుంటిది. అది జబ్బుగా కూడా వున్నట్టు పేదవాడి కళ్ళకు కనిపించింది. పేదవాడు దాన్ని చూసి, "ఇదీ పాపం నా లాగే వుంది," అనుకున్నాడు. అతను రెండు రోజులూ దాన్నే చూస్తూ వుండిపోయాడు. మూడో రోజున ఖలీఫా మనుషులు నలుగురు వచ్చి గది తలుపు తెరిచి, పేదవాణ్ణి ఖలీఫా వద్దకు తీసుకుపోయారు.

"నా ఉంగరం ఏమయింది? దాని ఆచోకీ నీ కేమైనా అంతుచిక్కిందా?" అని ఖలీఫా అడిగాడు.

"ఏలినవారు కరుణించాలి. నేనీ రెండు రోజులూ ఒక కుంటి బాతును తప్ప ఇంకేమీ చూడలేదు," అన్నాడు పేదవాడు.

"కుంటి బాతు" అని అతను అంటుండగానే ఖలీఫా మనుషులు పరిగెత్తుకుంటూ పోయి కుంటి బాతును పట్టుకుని, దాని పొట్ట కొయ్యగా అందులో ఖలీఫా పోగొట్టుకున్న వజ్రపుటుంగరం దొరికింది.

ఆ ఉంగరాన్ని ఒక దాసీది దొంగిలించి, ఎక్కడా దాచటానికి లేక, ఒక బాతు చేత మింగించి, గుర్తుగా ఉండగలందులకు దాని కాలొకటి విరిచింది.

పేదవాడి జ్యోతిష ప్రజ్ఞకు ఖలీఫా మెచ్చుకుని అంతులేని బహుమతులిచ్చాడు.

పేదవాడు ఇంటికి పోయి, "ఎలాటి బహుమతులు తెచ్చానో చూడు," అన్నాడు భార్యతో.

"నాకు బహుమతుల మాట చెప్పకు, ఆస్థాన జ్యోతిష్కుడివయావా లేదా?" అన్నది భార్య.

"ఇంకా లేదు," అన్నాడు భర్త విచారంగా మొహంపెట్టి.

"అయితే నాకు నీ మొహం చూపించకు," అన్నది భార్య.

పేదవాడికి ప్రాణం విసిగిపోయింది. నేరుగా ఖలీఫాను అడిగేసి లేదనిపించుకుందామనుకుని బయలుదేరి వెళ్ళాడు. ఖలీఫాగారు మిద్దె మీద కూర్చుని వున్నారు. ద్వారపాలకులు పేదవాణ్ణి అక్కడికి తీసుకుపోయారు.

"ఏలిన వారిని ఒక్కటి కోరదామని వచ్చాను. తమరు కరుణించినట్టయితే నాకు తమ ఆస్థాన జ్యోతిష్కుడుగా వుండాలని వుంది," అన్నాడు పేదవాడు. ఆ సమయానికే ఒక నౌకరు ఒక సంచీలో ఏదో పెట్టుకుని ఖలీఫా వద్దకు వస్తూ దూరాన కనిపించాడు.

"ఆ వచ్చేవాడు ఏం తెస్తున్నాడో చెబితే నిన్ను అలాగే ఆస్థాన జ్యోతిష్కుడుగా పెట్టుకుంటాను," అన్నాడు ఖలీఫా చిన్నగా నవ్వుతూ.

పేదవాడి గుండె జారిపోయింది. "ఏలినవారు మన్నించాలి! తమరిని హమాము నుంచి బయటికి రమ్మన్నాను. ఆ సమయానికే కప్పు కూలింది. కుంటి బాతు కనబడిందన్నాను. దాని పొట్టలో వజ్రపుటుంగరం దొరికింది. కుందేలు ఎంత యుక్తి గలదైతే ఏం లాభం, వేటగాడి ఉచ్చులో పడక తప్పదు!" అన్నాడు పేదవాడు.

ఇంతలో నౌకరు దగ్గిరికి వచ్చి మూటలో వున్న కుందేలును బయిటికితీసి ఖలీఫాకు చూపించాడు.

"శభాష్! శభాష్! నీ కంటె గొప్ప జ్యోతిష్కుడు ప్రపంచంలో ఉంటాడనుకోను. నీ కోరిక ప్రకారం, నిన్ను ఈ క్షణం నుంచే మా ఆస్థాన జ్యోతిష్కుడుగా నియమిస్తున్నాను!" అన్నాడు ఖలీఫా సంతోషంగా.

పేదవాడి రొట్టె విరిగి నేతిలో పడింది. అతడు ఇంటికి వచ్చి సంగతి చెప్పగానే, భార్య పొందిన ఆనందానికి అంతే లేదు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1983 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటించబడును.







Shantaram Mohan D. Desai

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఫిబ్రవరి నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింప బడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : తంతి తపాలా రాజ్యం

రెండవ ఫోటో : కపోతాల పని పూజ్యం

పంపినవారు : ఆర్. పట్టాభిరామరాజు, అడ్వకేట్, గిరిపురం, తిరుపతి-1

బహుమతి మొత్తం రు. 50/-నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# A burst of frolic!

NP

007

BUBBLE GUM

Treat yourself to
NP 007 bubble gum.
Savour its delicious flavour
and revel endlessly
with its bubble-power.
Bubble after bubble.




**THE NATIONAL PRODUCTS,**
Bangalore 560 032.

Pioneers in chewing gums and bubble gums.

*Beware of spurious and inferior Bubble Gums.*

# చుక్కలతో సరదాలు

రాజు కెనరా బ్యాంకునందలి తన సేవింగ్సు ఖాతానుండి డబ్బు తీసుకున్నాడు
ఆ డబ్బుతో ఈసారి అతను ఏం కొంటాడో కనుగొనగలరా ?
చుక్కలను నంబర్లతో కలిపిన మీకే తెలియును.







**కెనరా బ్యాంక్**

(జాతీయ బ్యాంక్)

## ఓహ్! తెలివైన పిల్లలకోసం.

తెలివైన విద్యార్థిగా వుండు. ఆశలను పెంచుకో! మరియు కెనరా బ్యాంకు తెలివైన నీలాంటి యువకులకు ఉన్నత విద్యాభ్యాసానికి ధనాన్ని అప్పుగా అందజేసి సహకరిస్తుందన్న విషయాన్ని జ్ఞాపకముంచుకో!

**నీవు మైనరు అయితే ఏం?**

నీవు కెనరా బ్యాంకులో నీకొరకు ఒక ఖాతాను ప్రారంభించమని నీ తల్లికిగాని తండ్రికిగాని చెప్పు. నీవు పద్నాలుగేండ్ల వాడవైన వెంటనే నీవే ఒక ఖాతాను సొంతముగా ప్రారంభించి నడపవచ్చును. చిన్న మొత్తమైన అయిదు రూపాయలతోనే వేరే ఖాతా ప్రారంభించి ఆ ఆనందాన్ని నీవే పొందు.

**విద్యానిధి:** నీవు డాక్టరువి కావాలనుకొంటున్నావా? లేక ఇంజనీరా?? లేక సైంటిస్టా??? అయితే దానికి జవాబు విద్యానిధి. నీ తల్లిదండ్రులతో వేరే ఒక ఖాతాను ప్రారంభించమని చెప్పు. నీ ఉన్నత విద్యాభ్యాసం చీకూచింత లేనిదిగా వుంటుంది.

**బాలక్షేమ:** చురుకైన పిల్లలు తమ పాకెట్ మనీ నంతటిని ఖర్చు పెట్టరు. కొంత కెనరా బ్యాంకు టి.వి. బాక్స్‌కోసం దాస్తారు. తెలివిగా ప్రవర్తించండి. మీ తల్లిదండ్రులను కెనరా బ్యాంకులో "బాలక్షేమ" ఖాతాను ప్రారంభించమని అడగండి. నాణేల్ని టి.వి. డబ్బాలో వేస్తూ అవి వృద్ధి చెందడం గమనించు. నీ కలలన్నీ నిజమవుతాయి.



## నవంబర్ నెల జరిగిన రంగుల పోటీ ఫలితాలు:

### I PRIZE
Master Hemchandra
Vineeta Paper Backs
905, Near Officer's Rest House
Achnera (Agra District)

### II PRIZE
Master Arup Datt
C/o Ashis Datt
2, M. Biswas Street
P.O. Krishnagar
Dist. Nadia—741 101
West Bengal

### III PRIZE
Master Chunu Datta
C/o Nitya Gopal Dutta
Kathuria Para
P.O. Krishnagar
Dist Nadia
West Bengal

**Plus one hundred consolation prizes**

## కెనరా బ్యాంకునుండి ఉచితం స్టిక్కర్స్

మీ బాలక్షేమ లేక మైనరు ఖాతా ఉన్న కెనరా బ్యాంకు శాఖనుండి స్టిక్కర్స్‌ను తీసుకోండి.



**కెనరా బ్యాంక్**
(జాతీయ బ్యాంక్)

CHANDAMAMA (Telugu) FEBRUARY 1983 Regd. No. M. 4854